నెహ్రూ బాల పుస్తకాలయం

# సిద్ధంకండి


ఉమా ఆనంద్

అనువాదం:

ఈశ్వర్

రేఖా చిత్రాలు:

వైజయంతీ రనెడే





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా



# స్నేహితులు

గంట గణగణమంటూ మ్రోగింది. ఆ చప్పుడు మాటుమణిగేలోగా ఎన్నో తలుపులు తెరుచుకున్నాయి. కుర్రాళ్ళందరూ పంజరంలోంచి బయటపడ్డపక్షుల్లా హాయిగా కేరింతలు కొడుతూ, నవ్వుతూ, తుళ్ళుతూ గుంపులు గుంపులుగా బళ్ళోంచి బయటికి వచ్చారు.

ఇద్దరు అబ్బాయిలు పాఠశాల మెట్లదగ్గర కలుసుకున్నారు. ''హమ్మయ్య... పరీక్షలు అయిపోయాయి నవీన్...'' అన్నాడు—ఆ ఇద్దరిలోను పొడుగ్గా ఉన్న అబ్బాయి. అతను చలాకీగా ఉన్నాడు.

''అవును కపిల్, ఈ సెలవుల్లో నువ్వు మళ్ళా క్యాంపుకు వెళతావను కుంటాను,'' అన్నాడు నవీన్. ఆ కుర్రాడు సన్నగా ఉన్నాడు. ముఖం పాలిపోయినట్లున్నా గంభీరంగా వుంది.

''అబ్బే...నేను ఈ ఏడాది వెళ్ళడంలేదు. నేను సిమ్లా సమీపంలో ఉన్న మా బాబాయి దగ్గరకు వెళ్ళబోతున్నాను. ఈసారి స్కౌట్ మాస్టారు క్యాంపు వెళ్ళడానికి మరో రెండు జట్లను ఎన్నుకున్నారు. వంతులవారీగా వెళుతుంటాము మేము. నువ్వు కూడా ఎప్పుడూ చదువుతూ కూర్చోక స్కౌట్లలో చేరితే బావుంటుంది నవీన్! అలాచేస్తే నీలో మంచి గుండె నిబ్బరమూ, బలమూ కలుగుతాయి.''

''నాకూ స్కౌటు కావాలనే ఉంది—కానీ అది సాధ్యం కాదని నీకు తెలుసు. నేను రోజూ సాయంకాలంపూట మా నాన్నగారికి దుకాణంలో సాయం చెయ్యాలికదా?''

కపిల్ ఆ తర్వాత మరేమీ మాట్లాడలేదు. అయితే ఆరోజు సాయంకాలం తన తండ్రి కపూర్‌ను అడిగాడు, ''నాతోబాటు నవీన్ కూడా 'తారా'కు వస్తే, విజయ్ బాబాయ్ ఏమైనా అనుకుంటారా నాన్నా!''

''వాడికో కార్డురాసి ఆ సంగతి కనుక్కోవచ్చుగా,'' అని సలహా ఇచ్చారు కపూర్. కపిల్ అలాగే ఉత్తరం రాసి, జవాబు కోసం ఎదురుచూడసాగాడు.

మూడు రోజుల తర్వాత కపిల్‌కు అతని బాబాయి రాసిన ఉత్తరం అందింది.

''ప్రియమైన కపిల్,

నీ స్నేహితుడు తప్పకుండా రావచ్చు. అతనుకూడా నీతోబాటు మేడమీది గదిలో వుండవచ్చు. ఆ అబ్బాయి మంచిస్కౌటు అని నేను అనుకుంటాను. మీ ఇద్దరూ 'క్యాంపర్స్ బాడ్జి' కోసం సిద్ధం కావచ్చు. మీ చెల్లెలు రేఖ ప్రస్తుతం 'గైడ్'గా అర్హత సంపాయించింది. ఇప్పుడు 'వంట బాడ్జి' కోసం సిద్ధమవుతూ వుంది. నిన్న రాత్రి రేఖ—వేయించిన బంగాళాదుంప బజ్జీ, బటాణీల పులావ్ చేసింది. ఎంత బావుందో! ఇక ముందుకూడా తనే వంట చేస్తానని హెచ్చరించింది. అందుకు సిద్ధంగా ఉండు! మీ పిన్ని మీ అమ్మను అడిగినట్లు రాయమన్నది. మీ నాన్నగారికి, అమ్మగారికి నా నమస్కారాలు తెలుపగలవు.

మీ ఇద్దరి కోసం ఆదివారంనాడు ఎదురుచూస్తుంటాము.

నీ ప్రియమైన బాబాయ్
విజయ్ కపూర్.

కపిల్ ఉత్సాహమూ, ఆనందమూ పట్టలేకపోయాడు. ''నేను వెంటనే వెళ్ళి, నవీన్‌కు ఈ సంగతి చెబుతాను,'' అన్నాడు వాళ్ళ అమ్మతో.

కర్నూల్ బజారు మధ్య ఉన్న–నవీన్ వాళ్ళ దుకాణానికి వెళ్ళడం అంటే– కపిల్‌కు ఎంతో ఇష్టం. అక్కడ కొత్త ధాన్యం, తీయని బిస్కెట్లు–వీటితో అదోరకమైన సువాసన వేస్తూ వుంటుంది. ఆ దుకాణం ఎప్పుడూ వచ్చే, పోయే జనంతో రద్దీగా ఉంటుంది.

ఆ రోజు దుకాణంలో నవీన్ ఒక్కడే ఉన్నాడు. కపిల్‌ను చూసి ఆశ్చర్యంతో ''ఏమిటి కపిల్, ఇలా వచ్చావ్? నువ్వు రావడం నాకెంత సంతోషంగా ఉందో తెలుసా?'' అన్నాడు.

''నవీన్, ముందు ఈ సంగతివిను. నేను నీకో ఆహ్వానం అందజెయ్యడానికి వచ్చాను.''

''నాకా? ఎవరినుంచి ఆహ్వానం?'' నవీన్ ఆశ్చర్యంగా అడిగాడు.

''ఈసారి సెలవులు మా బాబాయి వాళ్ళ ఊళ్ళో గడపడానికి వెళతానని చెప్పానుకదా! ఆయన సిమ్లా దగ్గర ఓ పాఠశాలలో ఫిజికల్ ట్రెయినింగ్ అధ్యాపకుడిగా పనిచేస్తున్నారు. ఆ వూళ్ళో అసిస్టెంట్ స్కౌట్ మాస్టారు కూడా ఆయనే. మా బాబాయ్ నిన్నూ నాతోబాటె వూరికి పిలుచుకురమ్మన్నారు. ఆయన నువ్వూ స్కౌట్‌వే అని అనుకుంటున్నారు. మీ అమ్మా, నాన్నా నిన్ను పంపుతారంటావా?''

''పంపుతారనే అనుకుంటాను. నాకూ రావాలనే వుంది. నేను ఇదివరకు ఎప్పుడూ కొండప్రదేశాలకు వెళ్ళలేదు,'' అన్నాడు నవీన్. ''కాస్త ఆగు, మా నాన్నగారిని పిలుస్తాను.''

నవీన్ తల్లిదండ్రులు నవీన్‌ను కపిల్‌కూడా పంపించడానికి ఒప్పుకున్నారు. ఇది నవీన్‌కు, కపిల్‌కూ ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. అదీగాక నవీన్‌తండ్రి కపిల్‌తో ''వీడి ఆరోగ్యం గురించి మేము ఆందోళన పడుతున్నాం. స్థలం మార్పు వాడికి మంచే చేస్తుంది. మీ బాబాయికి మా కృతజ్ఞతలు తెలియజెయ్యి బాబూ,'' అన్నాడు.

''మేము ఆదివారం ఉదయం ఆరుగంటల బస్సులో వెళ్ళి, 'తారా'కు మిట్ట మధ్యాహ్నం చేరుకుంటాము. మా బాబాయి ఇల్లు 'తారా' బస్‌స్టాండునుంచి ఫర్లాంగు దూరాన కొండమీద వుంది. మాపిన్ని ఒక ఆవును పోషిస్తున్నది. ఓ కూరగాయల తోట కూడా ఆమె పెంచుతున్నారు. అంచేత అక్కడ నవీన్ బలంగాను, ఆరోగ్యంగానూ తయారవుతాడులెండి.'' అన్నాడు కపిల్.

# కబుర్లూ, సెక్కిట్లూ

ఆదివారం ఆరుగంటలకు ముందే ఇద్దరు మిత్రులూ బస్‌స్టాండులో కలుసు కున్నారు. కపిల్ ఒక పెద్ద సంచీ, ఓ చిన్న సూట్‌కేసూ తెచ్చుకున్నాడు. నవీన్ చిన్నా, పెద్దా మూటలు చాలా తెచ్చుకున్నాడు.

"అబ్బ! ఏమిటిది నవీన్...ఇన్ని తెచ్చుకున్నావ్ నీవెంట?" అని అడిగాడు కపిల్. ఇద్దరూ బస్సెక్కి తమ సామాన్లను సీటుకింద సర్దుకున్నారు.

"మా అమ్మ మరీ మరీ చెప్పి ఇచ్చింది," అంటూ రొప్పుతూ, రొజుతూ నవీన్ ఒక పెద్ద బుట్టలాగాడు. "నా బట్టలు ఈ చిన్న రేకుపెట్టెలో ఉన్నాయి. తక్కినవన్నీ మీ పిన్నిగారికి...ఆ బుట్టనిండా మామిడిపళ్ళు ఉన్నాయి. ఈ పెద్ద పెట్టె నిండా—రకరకాల బిస్కెట్లు ఉన్నాయి. ఈ సంచీలో తాజా 'గుర్ సక్కర్' ఉంది."



''భలే, అయితే మనం వెళ్ళిచేరాక సరదాగా ఇవన్నీ తినడానికి ఎంతో బావుంటుంది. ఇప్పుడు వీటిని మోసుకుపోవాలే అని విచారించనక్కరలేదు,'' అన్నాడు కపిల్ అదోలా నవ్వుతూ.

సరిగ్గా అప్పుడే కండక్టర్ ఈలవేశాడు. ప్రయాణీకులు కంగారు కంగారుగా ముందుకూ, వెనక్కూ ఒకళ్ళ నొకళ్ళు తోసుకుంటూ బస్సెక్కారు. రథంలాంటి ఆపెద్ద



బస్సు ముందుకు కదిలింది. ఇద్దరూ బాగా సర్దుకొని కూర్చున్నాక—నవీన్ కపిల్‌ను అడిగాడు. "మీ విజయ్ బాబాయ్ నేను ఒక స్కౌటునని అనుకుంటున్నారన్నావ్. నేను కానని తెలిశాక, ఆయన నిరుత్సాహపడతారో ఏమో? అయినా ఇంతకూ స్కౌట్ (బాల భటుడు)గా నువ్వేం చేస్తావ్?"

"నేను రెండేళ్ళనుంచీ స్కౌటుగా ఉంటున్నాను. నేను రెండవ తరగతి స్కౌటు పరీక్షలు పాసయ్యాను. అంటే, నేను కొంతవరకూ ప్రథమ చికిత్స చెయ్యడం, సిగ్నలింగ్ మొదలైన విషయాలు నేర్చుకున్నాను. ఇంతకూ నీకు ఇంకో సంగతి తెలుసా? నేను స్కౌటును కావడానికి ముందు 'కబ్'గా ఉన్నాను.

"కబ్ అంటే ఏమిటి?"

"మరీ చిన్నవాళ్ళను 'కబ్స్' అంటారు. వాళ్ళు ఒకజట్టుగా ఏర్పడుతారు. నేను ఏడేళ్ళవాణ్ణిగా ఉన్నప్పుడు మన బడి 'కబ్స్' జట్టులో చేరాను. పన్నెండేళ్ళకు 'స్కౌట్' అయ్యాను. 'కబ్'గా ఉండడం భలే తమాషాగా ఉంటుందిలే. అసలు లార్డ్ బేడెన్ పవెల్‌కు 'కబ్స్'ను నెలకొల్పే అభిప్రాయం భారత దేశానికి చెందిన ఒక బాలుడి కథ విన్నతర్వాతే కలిగింది."

"ఇంతకూ లార్డ్ బేడెన్ పవెల్ ఎవరు? నువ్వు చెప్పేది ఏకథ?"

"లార్డ్ బేడెన్ పవెల్ ఆంగ్లేయుడు. ఆయన 1907లో స్కౌటు ఉద్యమాన్ని ప్రారంభించారు. మనలా నగరాలలో నివసించే బాలురకు ప్రకృతి గురించి, పక్షుల గురించీ, జంతువుల గురించే అట్టే తెలియదని ఆయన అనుకున్నారు. మనం ఏదైనా అడవిలోకి వెళ్ళామనుకో ఏం చేయాలో...ఎలా జాగ్రత్తపడాలో తెలియక అవస్థ పడతాము. పిల్లలు స్వతంత్రంగా ఆలోచించగలిగి ఉండాలని, భయం లేకుండా ఉండాలని, అవసరమైన అన్ని సందర్భాలలోను ఇతరులకు సాయంచెయ్యగలిగే స్థితిలో ఉండాలనీ—ఆయన ఆశించారు. చిన్నతనంనుంచే పిల్లలు వీటిని నేర్చుకుంటే, పెద్దవాళ్ళయ్యాక, వాళ్ళు మంచి పౌరులుగా రూపొందగలరని ఆయన భావించారు. ఇవాళ ప్రపంచలోని అనేకదేశాలలో స్కౌట్లు ఉన్నారు. ఈ స్కౌటు ఉద్యమం అంతర్జాతీయ సోదర వ్యవస్థ వంటిది."

"ఇక కథ అంటావా...దీన్ని మరో ఆంగ్లేయుడు రాశాడు. ఆయన పేరు రుడ్యార్డ్ కిప్లింగ్. ఆయన 'అడవి' (ది జంగిల్ బుక్) అనే పుస్తకం రాశారు. నువ్వది చదివావా?"

"లేదు. కాని నాకది చదవాలని ఉంది. ఇంతకూ ఆ కథ ఏమిటి?" అని అడిగాడు నవీన్.

"బహుశా విజయ్ బాబాయ్ దగ్గర ఆ పుస్తకం ఉంటుందనుకుంటాను. నువ్వు చదువు. తోడేళ్ళ కుటుంబంలో పెరిగిన 'మౌగ్లీ' అనే పల్లెటూరి పిల్లవాని కథ అది."

"అదెలా జరిగింది?"

"ఒకసారి మౌగ్లీ తల్లిదండ్రులు అతణ్ణి అడవిలోకి తీసుకువెళ్ళారు. అప్పుడు మౌగ్లీ చాలా చిన్నపిల్లవాడు. వాళ్ళు అడవిలోనే బస చేశారు. ఇంతలో ఒక పులి ఆహారం కోసం వేటకు బయలుదేరింది. వాళ్ళు చలి కాచుకోవడానికి వేసుకున్న నిప్పును చూసి షేర్‌ఖాన్ అన్న ఆ పులి అటువైపు దూసుకువచ్చింది. అయితే అది ఆరిపోతూ ఉన్న నిప్పులమీద కాలు పెట్టి తన పంజాను కాల్చుకుంది. ఆ బాధ భరించలేక పెడబొబ్బ పెట్టింది. మౌగ్లీ తల్లిదండ్రులు మేల్కొన్నారు. ఆ హడావుడి గందరగోళంలో మౌగ్లీ మెల్లగా అడవిలోకి పాకుతూ వెళ్ళి తప్పిపోయాడు మౌగ్లీని ఒక ఆడతోడేలు తన గుహలోకి తీసుకుపోయింది. అక్కడ ఆ పిల్లవాడు తోడేలు పిల్లలతో ఆడుకోసాగాడు. వాటితోబాటు పెరిగి పెద్దవాడయ్యాడు. వాటిలాగే వేటాడ్డం నేర్చుకున్నాడు. తక్కిన జంతువుల, పక్షుల భాషలను, సైగలను నేర్చుకున్నాడు."

"ఇవన్నీ అతనికి ఎవరు నేర్పారు?"

"అతని ఇద్దరు స్నేహితులు—ఒకటి భాలూ అనే తెలివైన ముసలిఎలుగుబంటి, భాగీర అనే చురుకైన చిరుతపులి. అయినా, ఇవన్నీ చదివితేనే బావుంటుంది. మనం 'తారా' చేరుకోగానే చదువుదువుగానిలే."



# సిద్ధంగా ఉండు

కాస్సేపటికి బస్సు బజారు మధ్యలో ఆగింది.

"ఉపన్నా..." కండక్టరు కేకవేశాడు. ముగ్గురు ప్రయాణీకులు దిగాక కండక్టరు ఈలవేశాడు.

"ఆపవయ్యా, ఆపు!" అంటూ ఒక ముసలాయన అరిచాడు.

ముసలాయన బస్సు ఎక్కాడు. ఆయన వెంబడే లావుగా ఉన్న ఒకామె, ఒక చిన్న పిల్ల ఎక్కారు. ఒక్కకుదుపుతో బస్సు కదిలేసరికి—ఆ వూపుకు చిన్నపిల్ల తూలి పడింది. ఆ పిల్లమోకాలు ఒక సీటు అంచుకు కొట్టుకోవడంతో గట్టిగా ఏడవసాగింది.

"కండక్టర్! కండక్టర్!" ముసలాయన అరిచాడు, "దయచేసి బస్సు ఆపయ్యా!"

"క్షమించాలి సార్. బస్సు తర్వాత స్టాప్‌లో ఆగేదాకా మీరు ఆగాల్సిందే." అన్నాడు కండక్టర్.

చిన్నపిల్ల మరింత బిగ్గరగా ఏడవసాగింది. "అయ్యో, దెబ్బతగిలి రక్తం కారుతున్నదే!" అన్నది ఆ పిల్ల తల్లి.

"నేను సాయపడగలనేమో," తన సీటుమీదినుంచి వంగుతూ అన్నాడు కపిల్. "నవీన్, నా సంచిని ఇలా అందుకో," అని ఆ సంచీవిప్పి అందులోంచి చక్కగా అమర్చి పెట్టిన పెట్టె ఒకదాన్ని తెరిచాడు కపిల్. అందులోంచి ఒక చిన్నసీసా బయటకితీసి "నేను గాయాన్ని శుభ్రం చేస్తానండీ. అయితే ఇది స్పిరిట్ కనుక కొద్దిగా మండుతుందేమో. పాపను ఒక నిమిషం పట్టుకోగలరా," అన్నాడు.

కపిల్ కొద్దిగా దూది తీసుకొని దాన్ని స్పిరిట్‌లో అద్ది వెంటనే ఆ గాయాన్ని చక్కగా తుడిచాడు. ఆ పిల్ల ఏడవబోయింది. అయితే అంతలోనే కపిల్ మరోసీసా బయటికి తీశాడు. దాంట్లో ఎర్రటి ద్రవం ఏదో ఉంది. "ఇలా చూడు పాపా, నీ మోకాలికి ఎర్రరంగు పూయబోతున్నాను. ఈ రంగు నీ ఫ్రాకురంగుకు సరిగ్గా సరిపోతుందిలే," అని నవ్వుతూ ఆ పిల్ల మోకాలికి ఎర్రరంగు ద్రవం పూశాడు.

"అబ్బాయ్, ఇవన్నీ నీదగ్గర ఎలా ఉన్నాయ్? నువ్వు వైద్యవిద్యార్థివి అనుకుందామన్నా, మరీ చిన్నవాడివిగా కనిపిస్తున్నావ్?" అని అడిగాడు ముసలాయన.

కపిల్ నవ్వాడు, "నాకు పద్నాలుగేళ్ళండి. అయితే నేను స్కౌటును. 'ఎప్పుడూ సిద్ధంగా ఉండు' అన్నది మా దీక్షావాక్యం. అందువల్ల నేను ఎప్పుడు ప్రయాణం చేస్తున్నా, నాతోపాటు ప్రథమ చికిత్సకు కావలసిన పరికరాలపెట్టె, మరికొన్ని పరికరాలూ తెచ్చుకుంటాను."

"ఐతే—నువ్వు స్కౌటువన్న మాట. మంచిది బాబూ...మంచిది. నీకు నా ధన్యవాదాలు," అన్నాడు ముసలాయన.

కొంతసేపటికి బస్సు ఒక ఊళ్ళో ఆగింది. 'కాల్కా' అన్నాడు కండక్టర్.

ముసలాయన, లావుగా ఉన్న ఆవిడ, చిన్నపిల్లా దిగిపోయారు. ఆ బస్సు అక్కడ ఇరవై నిమిషాలు ఆగుతుందనీ, అంచేత ఏమైనా తినదలుచుకున్నవారు—వెళ్ళి రావచ్చనీ ప్రయాణికులను ఉద్దేశించి చెప్పాడు కండక్టర్.

"మనం బంగాళాదుంప పూరీలు తినివద్దాంరా నవీన్," అన్నాడు కపిల్ బస్సు దిగుతూ. వాళ్ళిద్దరూ దగ్గరలో ఉన్న ఒక దుకాణానికి వెళ్ళారు.





## 'తారా'లోని కమతం

'కాల్కా'తర్వాత సాగిన ప్రయాణం నవీన్‌కు ఎంతో సంభ్రమాన్ని కలిగించింది. ఆ రోడ్డు మలుపులు తిరుగుతూ పైకి దారితీసింది. ప్రతిమలుపు తిరగగానే కొత్త కొత్త కొండల వరుసలు ఆకాశంలోకి ఎక్కడానికి వెళుతున్నట్లు కనిపించాయి. సూర్యుడు ప్రకాశవంతంగా వెలుగుతున్నప్పటికీ–చల్లగాలులు వీస్తుండడంతో నవీన్‌కు చలివేసి కాస్త వణకసాగాడు. క్రింద కొండమీద కనిపిస్తున్న తుప్పలు, పొదలు–పెద్ద పెద్ద నల్లని చెట్లతోను, విరబూచిన పూవులతోను కనిపిస్తున్న అడవులకు దారి చూపిస్తున్నట్లుగా వ్యాపించి ఉన్నాయి.

''ఎంత అందమైన అడవి!'' అన్నాడు నవీన్.

''ఈ పొడవైన నల్లని చెట్లు దేవదారులు. వాటికి ఆకులకు బదులు చిన్న సూదులవంటివి ఉంటాయి.'' అన్నాడు కపిల్.

''మరి ఈ ఎర్రని పూలేమిటి? గులాబీలా?''

కపిల్ నవ్వాడు. ''అవి గులాబీలుకావు. వాటిని 'రోడో డెండ్రాన్స్' అంటారు. మేనెలలో అడవి అంతా ఈ పూవులతో నిండిపోయి—ఎర్రగా మండిపోతున్నట్లు కనిపిస్తుంది. ఇప్పుడు—అంటే ఈ జూన్‌లో కొద్దిగానే మిగిలి ఉంటాయి.''

''ఈ చెట్ల గురించీ, పూవుల గురించీ బహుశా నువ్వు స్కౌటుగా ఉండే నేర్చుకున్నావనుకుంటాను.'' అన్నాడు నవీన్ కాస్త ఎగతాళిగా.

''అవును నవీన్! నేను 'ప్రకృతి (నేచర్)బాడ్జి' సంపాయించాను,'' అన్నాడు కపిల్. ఇద్దరూ విరగబడి నవ్వుకున్నారు. ''ఇలా చూడు నవీన్, 'తార' వచ్చేసింది. మన కోసం మా వాళ్ళు 'బస్‌స్టాండ్'లో కాచుకొని ఉంటారు.''

కపిల్ అన్నట్లు, బస్సు ఆగగానే ''అదుగో కపిల్ అన్నయ్య'' అన్న ఒక పెద్ద కేక వినిపించింది. ఒక పన్నెండేళ్ళ అమ్మాయి, తన రెండు జడలూ నడుముమీద వూగుతూవుంటే, చెంగున గెంతి బస్సు తలుపు తెరుచుకొని లోపలకు వచ్చింది.



''అరెరే, రేఖా! ఎంత పొడుగయ్యావ్,'' అన్నాడు కపిల్.

''ఆఁ, నీ అంత పొడుగు కాలేదులే,'' రేఖ నవ్వి, ''నన్ను బుట్ట తీసుకోనీ.'' అన్నది.

''ఇదిగో, ఇతను నవీన్. పిన్నికోసం బోలెడు సరంజామా తెచ్చాడు. ఇంతకీ విజయ్ బాబాయ్ ఎక్కడ?''

''ఇదిగో, ఇక్కడ వున్నాను!'' అన్న ఒక గొంతు ఉత్సాహంగా పలికింది. ''కబుర్లు తర్వాత చెప్పకుందువుగానీ, ముందు సామాన్లు దించనీయండి.''

వాళ్ళు తమ మూటా, ముల్లె అన్నీ దించుకున్న తర్వాత, బస్సు సిమ్లా వైపుకు సాగిపోయింది

''బావుంది కపిల్! ఇప్పుడు నువ్వూ నా అంత పొడుగు ఉన్నావ్!'' అన్నాడు విజయ్ కపిల్ భుజం తడుతూ.

''బాబాయ్! ఇతను నా స్నేహితుడు నవీన్,'' అన్నాడు కపిల్.

''నన్ను ఆహ్వానించినందుకు కృతజ్ఞుణ్ణి,'' అన్నాడు నవీన్ కొంచ్త సిగ్గుతో.



''నువ్వు రావడం మాకెంతో బావుంది.'' అన్నాడు విజయ్. ''కపిల్, అన్నట్లు పరీక్షలు ఎలా రాశావు?''

''మేము...అదే నేను పాస్ అవుతాను, నవీన్ మాత్రం ఎప్పటిలా తప్పకుండా మొదటి రాంక్ తెచ్చుకుంటాడు,'' అన్నాడు కపిల్.

వాళ్ళు ఇరుకుగా ఉన్న ఆ కొండదారి వెంబడి నడుస్తుండగా, ఎనిమిదేళ్ళ పిల్లలిద్దరు వాళ్ళవైపుగా పరుగెత్తి రాసాగారు.

''అదుగో...రాము—రాణి. ఇవాళ వాళ్ళు చెయ్యవలసిన 'మంచి పని' తప్పక చెయ్యాలంటారు,'' అన్నది రేఖ నవ్వుతూ.

''ఏమిటది?'' అన్నాడు నవీన్ ఆ మాటలు అర్ధంగాక.

''నువ్వు స్కౌటువు కావా?'' విజయ్ బాబాయ్ ఆశ్చర్యంగా అడిగాడు.

''కానండీ, ఇంకా...అప్పుడే...''నవీన్ చెప్పడానికి తడబడ్డాడు.

రేఖ మధ్యలోనే అందుకుని ''రాము—రాణి కవల పిల్లలు. రాము కబ్. రాణి బుల్‌బుల్. రోజుకు కనీసం ఒక మంచి పనైనా చెయ్యాలి అన్నది కబ్—బుల్‌బుల్ ప్రతిజ్ఞలలో ఒక అంశం. అంచేత ఈ కవల పిల్లలు ఇతరులకు సాయపడడం కోసం ఎదురుచూస్తూ వుంటారు. వాళ్ళ నాన్నగారు 'తారా' రైల్వే స్టేషన్‌కు 'ఇన్‌ఛార్జి'గా పని చేస్తున్నారు,'' అన్నది.

ఇంతలో ఆ పిల్లలిద్దరూ వీళ్ళను కలుసుకున్నారు. ''నన్ను సాయపడనీండి. నేను ఒక మూట పట్టుకొస్తా విజయ్ బాబాయ్,'' ''నాకో పెట్టె ఇవ్వు రేఖ అక్కయ్యా'' రాము, రాణి ఒక్కవక్క ఒగురుస్తూనే గడగడా అన్నారు.

''ఇదిగో...ఇదిగో ..ఒక్క నిమిషం ఆగండి...అలాగేనా మాట్లాడేది...ముందు కపిల్ అన్నయ్యకు 'హలో' చెప్పండి,'' అంటూ విజయ్‌బాబాయ్ మధ్యలోనే అడ్డుతగిలాడు. ''ఈ అబ్బాయి కపిల్ స్నేహితుడు నవీన్.''

ఆ పిల్లలు ఇద్దరినీ చూసి చిరునవ్వునవ్వారు, ''మమ్మల్ని సాయపడనీయండి,'' అన్నారు వాళ్ళు.

''తప్పకుండా...ఇదిగో ఈ సంచీని మీ ఇద్దరూ కలిసి పట్టుకొని తీసుకురండి. జారవిడిచేరు సుమా,'' అన్నాడు కపిల్.

ఆ బృందం అలా ముందుకు సాగిపోయింది.

"ఇదిగో వచ్చేశాం...'తారా ఫారం'లోకి...స్వాగతం అందరికీ......" అన్నాడు విజయ్ బాబాయ్, ఒక చిన్న ఎర్రగేటు తెరుస్తూ. గేటునూ, ఇంటినీ ఒక చిన్న రాళ్ళ బాట కలుపుతూ వుంది. ఆ ఇల్లుకూడా చిన్నదే. ఎర్రరంగు పూసిన ఆ ఇంటికప్పు ఏటవాలుగా ఉంది. ఆ ఇంటినిచూసి నవీన్ ఆశ్చర్యం పట్టలేక "అబ్బ...కథలలో వర్ణించే పర్ణశాలలా వుంది ఈ ఇల్లు," అన్నాడు.

"మన గది అదిగో...ఆపైన వుంది, ఆ త్రిభుజాకారపు కిటికీమీద పైకప్పు ఉంది చూడూ...అక్కడ," అన్నాడు కపిల్ ఇంటి పైభాగాన్ని చూపుతూ.

"మనం సంచీని పైకి తీసుకు వెళదాం," అన్నాడు రాము. ఆ కవలపిల్లలు తమ 'మంచి పని'ని మొయ్యలేక మొయ్యలేక మోస్తూ, భారంగా ముందుకు కదిలారు.





# అవసరానికి సాయపడే వ్యక్తి

ఆ కవల పిల్లలు—కపిల్‌కు, నవీన్‌కూ ఫారం (కమతం)ను పూర్తిగా చూపించడానికి సిద్ధమయ్యారు. ఆ కమతం అంత పెద్దదేమీ కాదు. అయినా చాలా ఆసక్తికరంగా వుంది. ఇంటి వెనుక కూరగాయల పాదులు ఉన్నాయి. వాటికి ఒకవైపున కోళ్ళపాక ఉంది. అది తీగెవలతో, కర్రచట్రాలలో అమర్చిన పాక. అందులో కోళ్ళు ఉండడానికి పెట్టెలవంటి గూళ్ళు ఉన్నాయి. ఆ పాక ఉన్న నేలమీద పూర్తిగా తాజా రంపపుపొట్టు వేయబడి ఉంది.

''మేము గుడ్లు సేకరించడంలో సాయపడతాం,'' అన్నారు ఆ ఇద్దరు పిల్లలూ.

''ఈ తలుపు కాస్త వదులుగా ఉండి, కదులుతూ వుంది. ఈ సంగతి నాన్నగారికి నేను చెప్పాను. కానీ ఆయనకు బొత్తిగా తీరికలేకపోవడంతో మరిచిపోయినట్లు వున్నారు,'' అన్నది రేఖ తీగెవల తలుపు తెరుస్తూ.

కపిల్ తలుపు కీళ్ళను పరిశీలించి చూశాడు. ''మీ నాన్నగారిని ఇబ్బంది పెట్టకు. నేనిది సరిచేస్తానులే. దీనికి కావలసిందల్లా రెండు కొత్త మరలు...ఇక పరికరాల పెట్టె నాదగ్గరే వుంది,'' అన్నాడు కపిల్.

నవీన్ తన స్నేహితుణ్ని ప్రశంసాపూర్వకంగా చూశాడు. కపిల్ చెయ్యగల పనులకు ఒక అంతన్నది లేదేమో అనిపించింది నవీన్‌కు. కపిల్ వడ్రంగం ఎక్కడ నేర్చుకున్నాడో అడగడం అనవసరం అనుకున్నాడు. అదికూడా ఖచ్చితంగా స్కౌటు శిక్షణలో భాగమేనని నవీన్‌కు తోచింది.

''మన ఆవు ఏది?'' కపిల్ కోళ్ళపాక వెనుక ఖాళీగా ఉన్న పాకను చూపుతూ అడిగాడు.

''పాపం...అది పోయిన ఏడాది చలికాలంలో చనిపోయింది. అయితే. మాకు జశ్వంత్ పాడికేంద్రనుంచి కావలసినంత పాలు, వెన్న తెచ్చుకుంటున్నాము,'' అన్నది రేఖ.

''భలే...జశ్వంత్ ఇక్కడ ఉన్నాడంటే నాకెంతో సంతోషంగా వుంది. అతను మంచి స్కౌటు. బహుశా అతను, నవీన్‌ను నన్నూ ఒకటి రెండు రాత్రులపాటు 'క్యాంపింగ్'కు తీసుకువెళతాడేమో,'' అన్నాడు కపిల్.

''అవును...అతనూ అందుకు ఇష్టపడతాడని నా నమ్మకం. కానీ ఇప్పుడు మనం ఏద్కైనా తినాలి,'' అన్నది రేఖ వంటింటివైపు దారితీస్తూ.

వంటింట్లో నవీన్ క్రిందగా ఉన్న ఒక బల్లను చూశాడు. ఆబల్ల గదిలోని స్టౌకు ఎదురుగా వుంది. ఆ బల్ల అవతల కొయ్యచట్రాల గోడకు ఒక కొయ్యపలక అమర్చివుంది. ఆ పలక కూచోవడానికి వీలైన బల్లలా వుంది.

రేఖ తల్లి అందరికీ భోజనం వడ్డించింది. ప్రతి ఒక్కరూ తమ పళ్ళాన్ని, మజ్జిగ గ్లాసును బల్లదగ్గరకు తీసుకెళ్ళారు. తృప్తిగాతిన్న నవీన్ ప్రతివారు తమ పళ్ళెం, గ్లాసు పట్టుకుని తూము దగ్గరకు వెళ్ళి కడగడం గమనించాడు. రేఖ తల్లికి రెండు వంట పాత్రలుతప్ప మరేవీ మిగల్చకుండా ఎవరికి వారు అలా చెయ్యడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. అతను ఎప్పుడూ తన ఇంట్లో తన పళ్ళాన్ని శుభ్రంచేసి



ఉండకపోవడంవల్ల, కపిల్ పళ్ళెం కడగడాన్ని జాగ్రత్తగా చూశాడు. ఆ తర్వాత తనుకూడా అలాగే తన పళ్ళెం, గ్లాసూ కడిగి తుడిచాడు. కపిల్, రేఖ చేసినట్లే తానూ వాటిని ఆ తూముకు ప్రక్కనే ఉన్న చట్రంలో బోర్లించి పెట్టాడు.

కపిల్ తనను గమనిస్తున్నట్లు చూసిన నవీన్, ''నేను త్వరలోనే నేర్చుకుంటాను,'' అన్నాడు.

''నువ్వు నేర్చుకోగలవులే,'' అన్నాడు కపిల్–నవీన్ భుజంమీద ఆప్యాయంగా చెయ్యివేస్తూ, ''పద...మన సామాన్లువిప్పి, ఆ తర్వాత కోళ్ళపాక తలుపు సరిచేద్దాం!'' అన్నాడు కపిల్.

# స్కౌటు క్యాంపు

''మీరు ఇవాళె వచ్చారు కనుక మరీ శ్రమ పడకండి,'' అన్నాడు విజయ్ బాబాయ్ ఆరోజు సాయంకాలం. ''మనం స్కౌటు క్యాంపుదాకా నడిచి వెళ్ళొద్దాం. ఈనెల స్కౌటు మాస్టర్లకు తర్ఫీదు ఇస్తున్నందువల్ల అక్కడ చిన్నపిల్లలు ఎవరూలేరు. అయినా మనం నవీన్‌కు ఆ ప్రాంతాలన్నీ చూపవచ్చును,'' అన్నాడు ఆయన.

కపిల్, నవీన్, రేఖ, విజయ్ బాబాయ్ దట్టమైన ఆ అడవిగుండాపోయే ఇరుకైన బాటవెంబడి వెళ్ళి, ఒక మైదానాన్ని చేరుకున్నారు. నవీన్—విశాలంగా, పెద్దదిగా ఉన్న ఆ మైదానాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. అది కవాతుచేసే మైదానంలా వుంది. ఆ మైదానానికి ఒక చివర క్రమరదుంగలతో వేసిన పాకలు ఉన్నాయి.

''మేము స్కౌటు క్యాంపుకు ఇక్కడికే వచ్చాం నవీన్. పద! నీకు భోజనశాల తక్కిన గదులూ చూపిస్తాను,'' అన్నాడు కపిల్.

ఆ పాకల్లో ఒక పాకనిండా మేజా బల్లలూ, ప్రడ ప్రడ కొయ్యబెంచీలు ఉన్నాయి. ప్రతి



జతకూ వనువు, ఎరువు, పచ్చ, నీలం ఇలా చక్కగా రంగులువూసి ఉన్నాయి. అవి చాలా అందంగా ఉన్నాయి. నిద్రపోవడానికివీలుగా అమర్చిన పాకలలో గోడల వెంబడి రైలు పెట్టెలలో ఉన్నట్లు మూడు అంతస్తుల పడక బల్లలు ఉండడం చూసి నవీన్ ఆశ్చర్యపడ్డాడు.

''ఇక్కడ కలిసి ఉండడం ఎంతో తమాషాగా ఉంటుంది కదూ!'' నవీన్ కపిల్‌ను అడిగాడు.

''అవును. నేను ఎంతో హాయిగా ఉన్నాను ఇక్కడ. మన దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ వచ్చిన పిల్లలతో అప్పుడు నాకుస్నేహం అయింది.''

ఆ పాక తలుపు దగ్గర రెండు చిన్న ముఖాలు తొంగిచూశాయి.

''హల్లో ఎక్కడనుంచి ఊడిపడ్డారు మీరు?'' ఆ కవల పిల్లలను ఉద్దేశించి అడిగాడు కపిల్.

''మేము నవీన్ అన్నయ్యకు 'పావా' సర్కిల్ చూపాలనుకుంటున్నాము,'' అన్నాడు రాము.

''బౌ–వౌ సర్కిలా? అదేమిటి?'' అన్నాడు నవీన్ నవ్వుతూ. ఆ కవల పిల్లలు ముసిముసి నవ్వులు నవ్వారు, ''బౌ...వౌ కాదు...పా...వా.''

విజయ్ బాబాయ్ నవ్వాడు. ''పా...వా... సర్కిల్‌లో కబ్స్ వాళ్ళు తమ తమ బృందాలతో సమావేశాలు జరుపుకుంటారు. అది ఇక్కడికి 500 గజాల దూరంలో ఉంది.''

''రామూ...మీ పా–వా సర్కిల్‌కు తీసుకు వెళ్ళు,'' అన్నాడు నవీన్.





ఆ కవలపిల్లలు తమముందు గంతులు వేసుకుంటూ, దుముకుతూ—ఎగురుతూ దారిచూపగా, వాళ్ళందరూ ఆ కొండ ప్రాంతానికి ఒక ప్రక్కనున్న మైదానంవంటి మరో చోటికి చేరుకున్నారు. ఆ మైదానం పెద్దమైదానంకన్నా చిన్నదిగా ఉంది. వృత్తాకారంలో ఉంది. అందులోకి దిగడానికి కొండ అంచు ప్రక్కనుంచి అడ్డదిడ్డంగా రాతిమెట్లు ఉన్నాయి.

''ఇది ఆరుబయటి రంగస్థలం (ఓపెన్ ఏర్‌థియేటర్)లా వుందే!'' అన్నాడు నవీన్.

''ఒక రకంగా అలాంటిదే. క్యాంపు చివరి రోజున కుర్రాళ్ళందరూ ఇక్కడ పెద్ద చలిమంట లాంటిది అంటించి—దానిచుట్టూ ఆడుతూ, పాడుతూ రకరకాల ప్రదర్శనలు



చేస్తారు. వాటిల్లో జానపద నృత్యాలు చెయ్యడం చిన్న చిన్న నాటకాలు వేయడం వంటివి ఎన్నెన్నో ఉంటాయి.''

''ఇక్కడకూడా అకేలా పౌవే సమావేశం జరుపుతాడు,'' అన్నాడు రాము ఏదో ముఖ్యమైన వార్త చెబుతున్నట్లు...

''అకేలా ఎవరు?'' అని అడిగాడు నవీన్. ఆ కుర్రాడికి కొత్త విషయాలు తెలుసుకోవడం అంటే ఎంతో ఆసక్తి.

''బాబాయ్...ఇప్పుడే గుర్తొచ్చింది. నవీన్‌కు ఆ 'అడవి' పుస్తకం ఇస్తావా? లేకపోతే నవీన్ ప్రశ్నలకు అంతు ఉండదనుకుంటాను,'' అన్నాడు కపిల్.

''అవును. తప్పకుండా నవీన్ చదవాలి,'' అన్నాడు విజయ్ బాబాయ్. 'కబ్' జట్టు నాయకుణ్ణి 'అకేలా' అంటారు. 'అడవి' పుస్తకంలో తోడేళ్ళమంద నాయకుడి పేరుకూడా అదే!'' అని వివరించాడాయన.

అప్పుడు సూర్యుడు కొండల వెనుక అస్తమిస్తున్నాడు. ఆకాశంమీది మబ్బులు బంగారు వన్నెనుంచి గులాబీరంగుకు మారి ఆ తర్వాత క్రమక్రమంగా మసకబారాయి. అంత అద్భుతమైన దృశ్యాన్ని తాను అంతకు ముందెన్నడూ చూడలేదనుకున్నాడు నవీన్.

"ఇది చాలా అద్భుతమైన చోటు," అన్నాడు నవీన్ తన ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తూ.

"ఒక ముసలాయన తన పదవీ కాలం ముగిసిపోగానే—భారతదేశంనుంచి వెళ్ళిపోయి—ఈ ఎస్టేట్‌ను బాలభటుల సంఘానికి బహుమతిగా ఇచ్చాడు. అంతకు ముందే కొందరు మన దేశనాయకులు 'హిందూస్తాన్ స్కౌట్స్' అన్న పేరుతో భారతీయ స్కౌట్ ఉద్యమాన్ని ప్రారంభించారు. 1947లో మనకు స్వాతంత్ర్యంరాగానే ఆ రెండు బృందాలూ విలీనమై 'భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్ ఆఫ్ ఇండియా' (భారతీయ బాలభటులు, మార్గదరకుల సంస్థ)గా ఏర్పాటు చేయబడింది. పద...ఇక ఇంటికి బయలుదేరుదాం."

సంజె చీకట్లు కమ్ముకోసాగాయి. చీకటి పడింది. వాళ్ళు ఇంటికి తిరిగి వస్తుండగా నవీన్‌తో "సిమ్లా దీపాలు చూడు," అన్నాడు కపిల్.

ఎదురుగా ఉన్న కొండ వేలకొద్దీ దీపాలతో వెలిగిపోతూ వుంది.

"ఇప్పుడు పైకి చూడు," అన్నాడు విజయ్ బాబాయ్. లక్షలకొలదీ నక్షత్రాలు తనపైనే వ్రేలాడుతున్నట్లు అనిపించింది నవీన్‌కు!

"ఇవి ఎంత పెద్దవిగా కాంతివంతంగా కనిపిస్తున్నాయి. మేము 'కర్నాల్'లో ఇంత కాంతిగల నక్షత్రాలను చూడనేలేదు," అన్నాడు నవీన్.

"కపిల్...నవీన్‌కు ఉత్తర నక్షత్రం చూపించు. ఆ అబ్బాయి తనంత తానే దాన్ని గుర్తుపట్టేలా చెప్పాలి," అన్నాడు విజయ్ బాబాయ్.

అలా నవీన్ చుక్కలతో నిండిన ఆకాశాన్ని దిక్సూచిగా ఉపయోగించడం నేర్చుకున్నాడు. ముందు సప్తర్షిమండలాన్ని గురించి ఆతర్వాత దానిసాయంతో కదలకుండా ఉండే ధృవనక్షత్రాన్ని కనుక్కోవడం నేర్చుకున్నాడు.

ఆ రాత్రి పడుకునేముందు నవీన్ తన స్నేహితుడితో "నేనిక్కడ ఉండడం చాలా ఆనందంగా వుంది కపిల్!" అన్నాడు.

"నీకిక్కడ సరదాగా ఉందంటే నాకూ ఆనందమే మరి! ఇక నిద్రపో నవీన్! రేపు ఉదయం లేవగానే కోళ్ళపాకను శుభ్రం చేస్తామని పిన్నికి మాట ఇచ్చాను."

# పనులపై ఆసక్తి

''టక్...టక్...''

నవీన్ మేలుకున్నాడు.

''టక్, టక్...టక్...''

''కపిల్...ఎవరో తలుపు తడుతున్నారు,'' అన్నాడు నవీన్. అంటూ కపిల్ పడకవైపు చూశాడు. అది ఖాళీగా వుంది. ఆ పడక గుడ్డలన్నీ మడిచిపెట్టి ఉన్నాయి. నవీన్ పడక మీదినుంచి ఛంగునలేచి, తన పడకను కూడా అలాగే మడిచి పెట్టాడు.

కపిల్ బట్టలు తొడుక్కుని సిద్ధంగా లోపలికి వచ్చాడు. ''బాగా నిద్ర పోయావా?'. అని అడిగాడు నవీన్‌ను.

''టక్...టక్...టక్...టక్...''

''విను కపిల్...ఎవరు తడుతున్నారు అలా?''

''అది వడ్రంగి పిట్ట. ఇంటి వెనుక ఉన్న పాత టేకుచెట్టుమీద ఉంటుంది అది. పద నువ్వు సిద్ధం కావాలి. కోళ్ళపాకకు వెళ్ళేదారిలో మనం దాన్ని చూద్దాము.''

కొన్ని నిముషాల తర్వాత వాళ్ళిద్దరూ ఒక చెట్టుకింద నిలబడ్డారు. ''ఎక్కడ అది,'' అని అడిగాడు నవీన్.

''ష్...శబ్దంచేస్తే ఎగిరిపోతుంది.'' కపిల్ హెచ్చరించాడు.

''టక్...టక్...టక్...టక్...''

''అదుగో...అక్కడచూడు,'' కపిల్ రహస్యంగా వడ్రంగిపిట్టను చూపించాడు.

నవీన్ జాగ్రత్తగా చూశాడు. ''టక్...టక్...'' వడ్రంగిపిట్ట సూటిగా ఉన్న తన ముక్కుతో చెట్టును పొడుస్తూనే ఉంది. ''అదేం చేస్తున్నది?'' అని అడిగాడు నవీన్.

''చెట్టు బోదెలో ఉండే చిన్న పురుగులను వెతుక్కుంటుంది.''

''అది చెట్టుబోదెమీద అలా ఎట్లా నడవగలుగుతున్నది?'' నవీన్‌కు ఆ పక్షిని చూస్తుంటే తమాషాగా ఉంది.

''అది కురచగా, లావుగా ఉన్న తన తోకమీద ఆధారపడుతోంది. సరే...మనం వెళదామా?''

ఆవులకొట్టంనుంచి కపిల్ ఒక ఎర్రని ఒంటిచక్రపు బండినీ, ఒక పెద్దచీపురునూ తెచ్చాడు. ''నువ్వు బండిని పట్టుకో. నేను రంపపు పొట్టును తలుపు దగ్గరకు ఊడుస్తాను తర్వాత మనం ఈ పొట్టును తోటలోని గోతిలోనింపి, కొత్త పొట్టుతెచ్చి ఇక్కడ నేలమీదపరుద్దాం,'' అన్నాడు కపిల్ నవీన్‌తో.

వాళ్ళు అలా పనిచేస్తుండగా—పిన్ని కోళ్ళకు ఒక బుట్టనిండా ఆహారం తెచ్చింది.

''మీరు ఇలా సాయపడడం ఎంతో బావుంది.'' అన్నది ఆమె. కొయ్య కొట్టెలలో ఆహారం నింపి, 'బో బో బో' అని పిలిచింది.

కోళ్లు తమ పెట్టెలలోంచి గెంతి, కొయ్యపెట్టెల దగ్గరకి బిలబిల పరుగెత్తుకుంటూ వచ్చాయి. కపిల్ నీళ్ళ కుండలను ఖాళీ చేశాడు. నవీన్ వాటిని మళ్ళీ నింపడానికి సాయపడ్డాడు.

''కపిల్'' అని పిలుస్తూ వచ్చిన విజయ్‌బాబాయ్ ''నాకో సాయం చేస్తావా?'' అని అడిగాడు.

''తప్పకుండా చేస్తాను బాబాయ్.''

''నేను పనిమీద సిమ్లావరకు వెళ్ళిరావాలి. కానీ గొర్రెల కమతం నడుపుతున్న వ్యాస్‌గారికి ఈ వారానికి సరిపడే కూరగాయలు ఇస్తానన్నాను. నువ్వూ, నవీన్ కూరగాయలను ఆయనకు అందజేస్తే నాకు







పెద్ద సహాయం చేసినట్టు ఉంటుంది.''

''అలాగే చేస్తాం బాబాయ్. నవీన్‌ను ఆ కొండలవైపు తీసుకువెళ్దామని నేనూ ఉవ్విళ్ళూరుతున్నాను.'' అని నవీన్‌తో, ''ఈ గొర్రెల కమతం స్కౌటు క్యాంపు నుంచి రెండు మైళ్ళ అవతల ఉంది.'' అన్నాడు కపిల్.

బయలుదేరే ముందు కపిల్ ఒక పెట్టె నిండా ఆహారాన్ని, ఒక ఫ్లాస్కునూ తన సంచీలో అమర్చుకున్నాడు. వాటితోపాటు ఒక పేనా కత్తిని, నోటు పుస్తకాన్ని కూడా అందులో ఉంచడాన్ని నవీన్ గమనించాడు. ఆ ఇద్దరూ చెరో కూరగాయల సంచీ తీసుకొని బయలుదేరారు.

వాళ్ళు గొర్రెల కమతం చేరుకోడానికి రెండు గంటలు పట్టింది.

''అరుగో వ్యాస్‌గారు''అన్నాడు కపిల్. అక్కడ పీలగా ఉన్న ఒక వ్యక్తి ఒత్తిగిలి పడి ఉన్న గొర్రె ఒకదాన్ని పరీక్షిస్తూ ఉన్నారు. ఆయనను చూసి కపిల్ చేయి ఊపాడు.

''వ్యాస్‌గారూ, మా బాబాయ్ మీకు కూరగాయలు పంపారు,'' అన్నాడు కపిల్.

''థాంక్స్ బాబూ! ఈ గొర్రెకు పాపం......కాలు దెబ్బ తిన్నట్టుంది,'' అన్నారు వ్యాస్.

''మీరు పనిమీద ఉన్నట్టున్నారు... మేము మరి బయలుదేరుతాం,'' అన్నాడు కపిల్—సంచులను అక్కడున్న కొట్టుగదిలో ఉంచుతూ...

# తప్పిపోవడం-దొరకడం

ఆ నడక వాళ్ళకి ఆకలి కలిగించింది. కపిల్ ఒక చక్కటి చోటు చూడగా ఇద్దరూ అక్కడ చతికిలబడి—భోజనం చేశారు. భోంచేసిన తర్వాత కపిల్ "వేటగాణ్ణి పట్టుకొనే ఆట ఆడుదామా" అన్నాడు.

"అది ఎలా ఆడుతారు?" అని అడిగాడు నవీన్.

"ఈ అడవిలో ఎక్కడికైనా వెళ్ళి దాక్కో. నీకు నేను ఐదు నిమిషాల గడువు ఇస్తాను. ఆ తర్వాత నువ్వు విడిచిపెట్టిన గుర్తులనుబట్టి నిన్ను కనుక్కుంటాము."

"నేను ఏ గుర్తులూ విడిచిపెట్టను," అన్నాడు నవీన్.

"నువ్వు అలాగే అనుకుంటావు. అయితే—స్కౌటు అన్ని రకాల గుర్తులనూ గుర్తుపట్టడానికి తగ్గ తర్ఫీదు పొంది ఉంటాడు. నేను నిన్ను కనుక్కొన్న తర్వాత—ఏ గుర్తులతో కనుక్కోగలిగానో చెబుతాను," అన్నాడు కపిల్.

నవీన్ పరుగెత్తాడు. ఆ కొండకు ఒకపక్క సూటిగా పొడుచుకొని వచ్చిన రాళ్ళగుట్టలు ఉండడం కనిపించింది. ఆ రాళ్ళగుట్టల క్రింద దాక్కుందామని—అక్కడ అడ్డుగా ఉన్న పొదలను తొలగించుకొని వెళ్ళి రాళ్ల కిందికి చేరుకొని అక్కడ నక్కి కూర్చున్నాడు.



కపిల్‌కు అయిదు నిమిషాల వరకూ ఆగే ఓపిక లేకపోయింది. ముందే వెతకడం ప్రారంభించాడు. నవీన్‌కు ఆశ్చర్యం కలిగించేలా పొదలమీద కపిల్ ముఖం కనిపించింది. కపిల్ నవ్వుతూ "నిన్ను పట్టుకున్నా..." అన్నాడు.

"ఇంత త్వరగా నన్ను ఎలా పట్టుకున్నావు," తను దాక్కున్న చోటునుంచి ఉస్సురుమంటూ బయటపడిన నవీన్ అడిగాడు.

''ఇలా చూడు. నువ్వు వదిలిపెట్టిన గుర్తులను చూపిస్తాను. మొదట నువ్వు కొండవైపు వెళుతూ, వస్తున్న దగ్గును అదిమిపెట్టావు. అలా నువ్వు వెళ్ళే దారి నాకు తెలిసేలా చేశావు. ఆ తర్వాత అక్కడ తడిమట్టిమీద నీ కాలిముద్రలు చూడు. నువ్వు పొడిమట్టిమీద నడిచి ఉండాల్సింది. ఇక ఈ పొదలు చూడు. నువ్వు లోపలకు వెళుతూ వీటి కొమ్మలను బాగా వంచిపెట్టావు. వాటిమధ్య ఆ సందు చూడు.''

''సరే, నేను వదలగలిగినన్ని గుర్తులూ వదిలిపెట్టానన్న మాట. ఇప్పుడు—ఇక నీవంతు. నేను మంచి డిటెక్టివ్‌ను అవుతానో—కానో చూస్తాను.'' అన్నాడు నవీన్. కపిల్ ఎటువెళ్ళినదీ తెలియజేసే చప్పుడు కోసం నవీన్ ఓర్పుగా కాచుకున్నాడు. అయితే గాలి చప్పుడూ, పిట్టల అరుపులూ తప్ప—అతనికి మరే ధ్వనీ వినిపించలేదు. ఐదు నిమిషాలు గడిచాక—ఏం చెయ్యాలో పాలుపోలేదు. ఆదరాబాదరగా తానువెళ్ళి దాక్కున్న స్థలానికి—ఎదురువైపుగా బయలుదేరాడు. అడుగుల గుర్తుల కోసం, విరిగిన కొమ్మల కోసం వెతికాడు కానీ లాభం లేకపోయింది

అకస్మాత్తుగా అతని దృష్టి పక్కన పొదలమీదికి మళ్ళింది. ఆ పొదల్లో ఏదో కదిలినట్లయింది. నవీన్ బిగుసుకుపోయాడు. అది పాము కాదుగదా అనుకున్నాడు. అప్పుడు నవీన్‌కు ఏదో సన్నని మూలుగు వినిపించింది.

ఆ మరుక్షణం తమ ఆట సంగతి మరిచిపోయి—గట్టిగా ''కపిల్...కపిల్... కపిల్...'' అని కేకలు పెట్టాడు.

ఉన్నట్టుండి వినవచ్చిన ఆ కేక, ఆ కేకలోని తొందరా కపిల్‌కు ఆత్రుతను కలిగించాయి. అతను నవీన్ బయలుదేరిన చోటికి పదిగజాల దూరంలోనే—సగం పెరిగిన దేవదారు దుంగల వెనుక నక్కి ఉన్నాడు. ముందుకు ఉరికి కేక వినిపించినవైపుకు పరుగెత్తాడు కపిల్—''ఇంతకీ ఈ పట్నవాసపు బైతుకు ఏమైవుంటుంది?'' అనుకుంటూ.

రెండు రాళ్ళమధ్య—బోర్లగిలా పడుకుని, ఎదురుగా పొదలమధ్య భాగాన్ని అదే పనిగా చూస్తున్న నవీన్‌ను చూశాడు కపిల్.

''నవీన్, నీకేం ఫరవాలేదుకదా?'' అని ఆత్రంగా అడిగాడు.

''కపిల్, ఇలారా! నేను దాన్ని తాకలేకపోయాను...విను...'' కపిల్‌కు ఒక మూలుగు వినిపించింది. వంగి చూశాడు. భయంతో బిక్కచచ్చిపోయి, నొప్పితోను అలసటతోనూ మూలుగుతూ, పొదకింద గోతిలో పడివున్న ఒక కుక్కపిల్ల కపిల్‌కు కనిపించింది. దాని ముంగాలు ఒక బోనులో ఇరుక్కుని ఉంది.

''అయ్యో పాపం...నవీన్...కాస్త ఆగు. నేను బోను తెరుస్తాను. ఇలాంటి దుర్మార్గాలు చేస్తుంటారని నాకు తెలుసు. దొంగతనంగా వేటాడేవాళ్ళు కుందేళ్ళను పట్టుకోవడానికి—ఈ బోనులు పెడుతూ వుంటాను.''

ఆ కుక్క కీచుకీచుమంటూ అరిచింది. వాళ్ళిద్దరూ దాన్ని గోతిలోనుంచి—బోనుతోబాటు వెలుపలికి తీశారు. కపిల్ బోనుతెరిచి ఆ కాలును బయటికి తీశాడు. అది అతని చేతిలో బలహీనంగా వేలాడింది.

''ఈ కాలు విరిగిపోయిందేమో...పాపం, చిన్న కుక్కపిల్ల, ఎముక మామూలవుతుందనుకో...అయితే ఇది ఇక్కడ చాలారోజులనుంచీ ఉందనుకుంటాను. ఎలా చిక్కిపోయిందో చూడు. తిండిలేక అలమటిస్తున్నది.''

''ఎంత దుర్మార్గం.'' బోనును అవతలకి నెట్టుతూ అన్నాడు నవీన్.

''దాన్ని పారెయ్యకు నవీన్. ఈ విషయం గురించి మనం ఫిర్యాదుచెయ్యాలి. మనం ఈ కుక్కపిల్లను త్వరగా ఇంటికి తీసుకుపోదాం,'' అన్నాడు కపిల్.



# చిన్న భాలూ

ఇద్దరూ ఇంటికి చేరారు. అప్పుడే విజయ్‌బాబాయ్ గేటు దగ్గరికి వచ్చాడు.

''ఏమిటిది?'' అని అడిగాడు ఆయన.

కుర్రవాళ్ళు కథంతా చెప్పారు. విజయ్ బాబాయ్ నవీన్ చేతిలోంచి బోనును తీసుకున్నాడు. ''ఇది చాలా దుర్మార్గం. దీన్ని పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్ళి–రిపోర్టు ఇచ్చి వస్తాను. మీ పిన్ని ఈ కుక్కపిల్ల కాలికి కట్టువేయడానికి సాయం చేస్తుందిలే!''

పిన్ని కుక్కపిల్లతో తంటాలు పడుతుండగా రేఖ లోపలికి వచ్చింది. నవీన్ ఆమెకు కథ అంతా మళ్ళీ చెప్పాడు. ఆ కుక్కపిల్ల రేఖకు ఎంతో నచ్చింది. ''దీన్ని మనం పెంచుకోవచ్చా? మనం పెంచుకుందాం దీన్ని. భాలూ చనిపోయాక మనకు కుక్క అంటూ లేదు. ఇదికూడా భాలూలాగే గోధుమ రంగులో నల్లముట్టితో ఉంది. మనం దీన్ని చిన్ని భాలూ అని పిలుద్దాం.''

''అసలు మనం దీన్ని రక్షించగలమా అని చూడాలి. ఇది చాలా బలహీనంగా ఉంది.''

''దీని పరిచర్యల విషయం నేను చూసుకుంటాను. ఉండండి, మొదట దీనికి మెత్తని పక్క ఏర్పాటు చేద్దాం. నవీన్, నాకు సాయం చేస్తావా?'' అన్నది రేఖ ఆత్రంగా.

ఆమె పాకలోనికి పరిగెత్తింది. నవీన్ ఆమె వెనకే వెళ్ళాడు. ఖాళీగావున్న గుండ్రని బుట్ట ఒకటి వాళ్ళకు దొరికింది. నవీన్ దాన్ని తుడిచి–దుమ్ము తట్టాడు. రేఖ దానిమీద ముందుగా మెత్తని గడ్డి పరిచింది. తర్వాత ఆమె ఆ గడ్డిమీద చింపిరి గుడ్డలను మెత్తగా అమర్చింది. తర్వాత కుక్కపిల్లను అందులో ఉంచారు.

ఇంతలో రాము, రాణి పరుగెత్తుకొని వచ్చారు. రాణి ఒక పెద్ద ఆల్బమ్ వంటి పుస్తకాన్ని తెచ్చింది. ''నేను నా అడవిపూల సేకరణ మీకుచూపిద్దామని తెచ్చాను'' అన్నది ఆమె కపిల్‌తో.

''మొదట మేము నీకు చూపాలనుకున్నదాన్ని చూడు,'' అన్నాడు కపిల్ కుక్కపిల్లను చూపుతూ.

''అసలు దీనికి తిండి ఎలా పెట్టాలో తెలియటంలేదు. గిన్నెలోంచి తాగడానికి

కూడా ఇది బలహీనంగా ఉంది. దీనికి పాలుతాగించడానికి సీసాకూడా లేదు,'' అన్నది పిన్ని.

''నా బొమ్మ పాలసీసా సరిపోతుందా?'' అని అడిగింది రాణి.

''మంచి సలహా...'' అన్నాడు కపిల్. ఆ కవల పిల్లలు పరుగెత్తుకు వెళ్ళి సీసా తెచ్చారు. అది కుక్కపిల్లకు సరిగ్గా సరిపోయింది. రేఖ కుక్కపిల్లకు పాలసీసాలోంచి పాలు తాగడం నేర్పింది.

''నవీన్, నీకు తెలుసా? ఇవాళ నువ్వు స్కౌటు పరీక్ష పాసయ్యావు!'' కపిల్ తన స్నేహితుడితో అన్నాడు.

''అదేమిటి?'' నవీన్ ఆశ్చర్యంగా అడిగాడు.

''స్కౌటు అన్ని జంతువులకూ స్నేహితుడు,'' అన్న సంగతి చెప్పాడు కపిల్.

''కబ్స్‌కు కూడా అని చెప్పు కపిల్ అన్నయ్యా,'' అన్నాడు రాము.

''అలాగే బుల్‌బుల్స్‌కు, గైడ్సుకు కూడా'' అన్నది రాణి—తను ఏమాత్రమూ వెనుకబడడం ఇష్టంలేక...

ఈలోగా ఆకలి, నొప్పి కూడా తగ్గడంతో చిన్నిభాలూ బుట్టలో ముడుచుకుని పడుకుని—కాస్సేపటికే నిద్రపోయింది.



# రాత్రి హెచ్చరిక

ఆరోజు జరిగిన సంఘటనలు తనకు చాలా ఉత్సాహభరితంగాను, అద్భుతంగాను ఉండడంతో నవీన్ ఆ రాత్రి నిద్రపోలేకపోయాడు. 'అడవి' పుస్తకం చదవడం ప్రారంభించాడు. కపిల్ నిద్రపోవడంతో దీపం ఉంచడం ఇష్టం లేక—అది ఆర్పి, కిటికీ దగ్గర కెళ్ళి నిలబడ్డాడు. కపిల్ తనకు చెప్పిన నక్షత్రాలు—ఎక్కడెక్కడ ఉన్నాయో—గుర్తుపట్టడానికి ప్రయత్నం చెయ్యసాగాడు.

దూరాన ఎక్కడో నక్కకూత పెట్టింది. అది నిశ్శబ్దమైన ఆ రాత్రివేళ చాలాదూరం వరకూ వినిపించింది. అంతలో నవీన్ దృష్టికి—స్కౌటు క్యాంపుకింద ఉన్న పొదలనుంచి దట్టమైన పొగరావడం కనిపించింది.

అకస్మాత్తుగా నిప్పు—రవ్వలు—జల్లులా మీదికెగసి—నక్షత్రాలలా కిందపడడాన్ని నవీన్ చూశాడు. అంతలోనే మరో పొదకు నిప్పు అంటుకుంది. మళ్ళీ నక్కకూత వినిపించింది.



నవీన్‌కు ఏమీ పాలుపోలేదు. కపిల్ తనకు వివరించిన భయంకరమైన కార్చిచ్చు ఇలాగే ప్రారంభం కాదుకదా అని అనుకున్నాడు. తన స్నేహితుణ్ణి లేపాలా వద్దా? లేకపోతే తను మరీ చిత్రంగా ప్రవర్తిస్తున్నాడా?

నవీన్ ఆలోచిస్తూ కూర్చోకుండా వెంటనే కపిల్ భుజాన్ని నెమ్మదిగా తట్టి—"కపిల్, కపిల్...లే" అన్నాడు మెల్లిగా.

"ఏమైంది?" అని మత్తుగా గొణిగాడు కపిల్.

''నాకు సరిగ్గా తెలియదు కాని అది అడవి చిచ్చేమో...'' అన్నాడు.

కపిల్ వెంటనే పడకమీదనుంచి లేచి, బయటికి చూశాడు. ''అవును. అడవి చిచ్చులాగే ఉంది. ఏదైనా వెచ్చగా కప్పుకో. టార్చి ఎక్కడ? కిందికిరా. నేను బాబాయిని లేపుతాను'' అన్నాడు. కపిల్ అలా మాట్లాడుతూనే ఒకస్వెట్టరు తొడుక్కుని టార్చిలైటు తీసుకొని—చెప్పులు వేసుకుని కిందికి పరుగెత్తాడు.

నవీన్ కిందికి వెళ్ళేసరికే విజయ్ బాబాయ్ లేచి, బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాడు. ''పదండ్రా అబ్బాయిలూ,'' అన్నాడు.

దూరాన ఎక్కడో పెద్ద గంట మోగుతున్న చప్పుడు వినిపించింది వాళ్ళకు. ప్రమాదాన్ని సూచించే ఆ గంటమోత ఆ కొండలలో అదే పనిగా వినిపించసాగింది.

వాళ్ళ బాటవెంబడి పరుగెత్తేసరికే—ఇంకా ఎందరో చేతుల్లో బొక్కెనలతోను, టార్చిలైట్లతోను రాసాగారు.

వాళ్ళు నిప్పు అంటుకున్న చోటుకు చేరుకొనేసరికే మంటలు బాగావ్యాపించాయి. అక్కడ కొందరు వరుసలో నిలబడి, ఒకరి కొకరు త్వరత్వరగా బొక్కెనలు అందిస్తూ, నీటిని చేరవెయ్యడాన్ని నవీన్ చూశాడు. జుట్టు నెరిసిన ఒక ముసలాయన మంటలు ఆర్పడాన్ని పర్యవేక్షణ చేస్తున్నాడు. విజయ్ బాబాయి, కపిల్, నవీన్ ముగ్గురూ బొక్కెనలు చేరవేసే వరుసలో నిలబడ్డారు. నీళ్లధార మండుతున్న ప్రాంతాలదాకా వెళ్ళడంలేదు.

ముసలాయన ''మనం ఎదురు నిప్పు అంటించాలి. జశ్వంత్...వాలంటీర్లను తీసుకురా,'' అన్నాడు.

''వస్తున్నా!'' అన్నది ఒకగొంతు. దృఢంగా పొడవుగా ఉన్న సిక్కుయువకుడు అతని వెంబడి మరో ఇద్దరు ముగ్గురు ముందుకు పరుగెత్తడాన్ని నవీన్ చూశాడు. వాళ్ళు కొండమీదికి పరుగెత్తి వెళ్ళి—ఆ పక్కనున్న పొదల వరుసలకు పూర్తిగా నిప్పు అంటించారు. ఇదిచూసి ఆశ్చర్యపడ్డ నవీన్ ''కపిల్, వాళ్ళు ఏం చేస్తున్నారు?'' అని అడిగాడు.

''ఆ రెండు నిప్పులూ ఆ చెట్లకింద కలుస్తాయి. నిప్పు—నిప్పును ఆర్పుతుంది నవీన్. ఆ సిక్కుయువకుడు ఎవరో తెలుసా? నా స్నేహితుడు జశ్వంత్,'' అన్నాడు కపిల్.

నిప్పు అంటుకున్న భాగం కిందవైపున కొందరు ఆ పొదలను కర్రలతోకొడుతూ

వడవనాగారు. వాళ్ళు నీళ్లతో తడిసిన పాదలలోనుంచి నిప్పురవ్వలు ఎగిరి మళ్లీ నిప్పు అంటుకోకుండా వాటిని కాళ్ళతో తొక్కసాగారు.

ఇంతలో పొదలగుండా వ్యాపిస్తున్న ఆ రెండుమంటలూ, ఒకచోట కలిసి భగ్గుమని అంతలోనే చప్పగా చల్లారిపోయాయి. ఇదిచూసి నవీన్ ఆశ్చర్యపోయాడు.

''ఇసుక చల్లడానికి మరికొందరు కావాలి,'' అన్నాడు జశ్వంత్. ''రా నవీన్'' అన్నాడు కపిల్. కొత్తగా మరో పనిచెయ్యవచ్చునన్న సరదాతో ఇద్దరూ జశ్వంత్ దగ్గరికి పరుగెత్తారు.

''హల్లో కపిల్! నువ్వు వచ్చావని విన్నాను. మనం ఎలా కలుసుకున్నామో చూశావా? మనం తీరిగ్గా మాట్లాడుకోవడానికి ఇప్పుడు కుదరదు. మాకు సాయం చెయ్యి.'' అన్నాడు.

కవాతు మైదానం చివర ఒక ఇసుక గొయ్యి ఉంది. ఆ స్నేహితులు అందులోని ఇసుకను త్వరత్వరగా తవ్వి నిప్పుమీదికి పోశారు. కాసేపటికి విజయ్ బాబాయ్ వాళ్ళ దగ్గరకు వచ్చాడు. ''మనం చెయ్యవలసిన పని చేశాము. సిమ్లా అగ్నిమాపక దళం వాళ్ళు వచ్చారు. జశ్వంత్! మా కమతానికి వచ్చి కాస్త టీ తాగి వెళ్ళకూడదూ?'' అన్నాడు ఆయన.

బాగా అలిసిపోయినా, మంచి పనిచేశామన్న తృప్తితో వాళ్ళు కమతానికి తిరుగు ముఖం పట్టారు. వాళ్ళు వేడివేడి టీ తాగుతుండగా కపిల్ జశ్వంత్‌తో అన్నాడు, ''నువ్వు మమ్మల్ని రెండు రాత్రులు క్యాంపు చెయ్యడానికి పశువుల కాపరి కుటీరం దగ్గరకు తీసుకు వెళ్ళకూడదూ?''

''ఓ దానికేం...నాకూ ఇష్టమే. ఈ వారం చివర వెళదాం. రేపు నేను చంద్‌పూర్ పశువుల సంతకు ఒక స్కౌటు బృందంతో వెళుతున్నాను—అక్కడివాళ్లకు సహాయపడడానికి. వాళ్ళకు కార్యకర్తలు తక్కువగా ఉన్నారు. నువ్వూ నాతో వస్తావా కపిల్?'' అని అడిగాడు జశ్వంత్.

ఆ స్కౌట్లు—జశ్వంత్, కపిల్ మరుసటిరోజు ఉదయం స్కౌటు కార్యకర్తల బృందంతోబాటు వెళ్ళడానికి నిర్ణయం తీసుకోవడం జరిగింది.

# చాంద్‌పూర్ సంత

చాంద్‌పూర్ గ్రామం—'తారా' నుంచి యాభై మైళ్ళ దూరాన 'కల్కా' రోడ్డు మీదనుంచి తిరిగే ఒక మలుపులో ఉంది. ప్రతి ఏడాది మూడు రోజులపాటు అక్కడ సంత జరుగుతుంది. అక్కడ ఒక గడ్డమీద చండీదేవి గుడి ఉంది ఆ చిన్న గుడిముందు ఒక కోనేరు ఉంది. ఆ చుట్టుప్రక్కల కొండలలోని గ్రామాలకు చెందిన రైతులు సంతకు వస్తుంటారు. అక్కడ వాళ్ళు పశువులను కొనడం, అమ్మడం వంటివి చెయ్యడంతోబాటు చండీదేవికి పూజలు కూడా చేయిస్తూ ఉంటారు.

జశ్వంత్, కపిల్ సిమ్లా స్కౌటు బృందంతో కలిసి, తర్వాతిరోజు ఉదయం బస్సులో చాంద్‌పూర్ వెళ్ళారు.

చాంద్‌పూర్‌లో గుడికింది మైదానం అప్పటికే జనంతోను, పశువులతోను కిటకిటలాడుతోంది. స్కౌట్లకు వాళ్ళు చెయ్యవలసిన పనులేవో చెప్పడం జరిగింది. జశ్వంత్ జట్టుకు పశువులను ఉంచే చోటు చుట్టూ కంచెకట్టడానికి సాయపడే అవకాశం లభించింది. కపిల్‌కు వైద్యశిబిరంలో పనిచేసే అవకాశం దొరికింది. అక్కడ ఒక డాక్టరు పిల్లలకు టీకాలువేస్తూ, జబ్బుపడ్డ వాళ్ళకు వైద్యం చేయసాగారు. పిల్లలు ధైర్యంగా టీకాలు వేయించుకుంటున్నారు. కానీ వాళ్ల తల్లులు మాత్రం ఎంతో ఆందోళనతో డాక్టరువల్ల పిల్లలకు ఎలాంటి ప్రమాదమూ ఉండదుకదా అన్న హామీని పదేపదే చెప్పించుకుంటున్నారు.

ఆ ఉత్సవానికి ఎందరో ముసలివాళ్ళు చండీదేవి దర్శనానికి యాత్రీకులుగా వచ్చారు. కపిల్ స్కౌటు క్యాంపుకు తిరిగివస్తూ, ఎగుడుగా ఉన్న గుడిమెట్లు ఎక్కలేక అవస్థపడుతున్న ఒక ముసలామెను చూశాడు. అప్పటికే ఆ రోజంతా వైద్యశిబిరంలో పనిచేసి అలిసిపోయినందువల్ల ఒక కప్పు టీ తాగితే బావుండునని బయలుదేరాడు. అయితే ముసలామెకు సాయం అవసరమని కపిల్ గుర్తించాడు.

"అమ్మా! మీకు సాయం చెయ్యనివ్వండి," అన్నాడు.

"ధన్యవాదాలు బాబూ," అన్నదామె కపిల్ భుజంమీద చెయ్యివేసి.

గుడి ముందున్న కోనేరులో ఎందరో స్నానం చేస్తున్నారు. ఆ కోనేటి దగ్గర హరి అనే ఒకస్కౌటు అక్కడికి వచ్చినవారికి సాయపడుతూ ఉండడాన్ని కపిల్ గమనించాడు.

హరి ఒక ముసలాయనను నీటినుంచి గట్టెక్కిస్తున్నాడు. అంతలో ఒక పెద్ద కేక వినిపించింది. అంతే! ఒక పిల్లవాడు నీళ్ళలో పడిపోయాడు.

అది చూడగానే చటుక్కున హరి తన చెప్పులు విడిచి నీళ్ళలోకి దూకాడు. ఆ పిల్లవాడు అప్పటికే ఒకసారి మీదికితేలి, లోపలికి వెళ్ళిపోయాడు. హరి నీళ్ళలోకి ఈదుతూవెళ్ళి, ఆ పిల్లవాడి కిందికి చేరుకుని అతణ్ణి చేతుల్లోకి ఎత్తుకొని వెల్లకిలాతేలి ఈదుకొంటూ వచ్చాడు. కపిల్ గబగబా మెట్లుదిగివచ్చి, పిల్లవాణ్ణి అందుకున్నాడు. ఆ పిల్లవాడి కడుపు నేలమీద ఆనేలా ఉంచి, వీపుమీద మెల్లిగా ఒత్తడం ప్రారంభించాడు. కపిల్ అలా క్రమపద్ధతిలో చికిత్స చేయడం 'ప్రాణ సంరక్షణ' పరీక్షలో నేర్చుకున్నాడు.

ముద్దగా తడిసిపోయిన హరి ''ఎలా వున్నాడు కుర్రవాడు?'' అని కపిల్‌ను అడిగాడు.



''మరేం ఫరవాలేదు. అంతగా నీళ్ళు మింగలేదు.'' అన్నాడు కపిల్. ఇంతలో ఆ పిల్లవాడు ఒకసారి ఎగశ్వాస విడిచి నీళ్ళుకక్కి ఏడవడం ప్రారంభించాడు. ''హరీ, ఆ తడిగుడ్డలు మారిస్తే మంచిదేమో?'' అన్నాడు కపిల్.

''నేనువెళ్ళి డాక్టరుకు చెబుతాను.'' అంటూ చుట్టూ ఆందోళనలో మూగిన గుంపును నెట్టుకుంటూ ముందుకు వెళ్ళాడు హరి. ''పిల్లవాడికి కాస్త గాలి సోకనివ్వండి! మరీ అలా దగ్గరగావచ్చి గుంపుగా నిలబడకండి,'' అన్నాడు అక్కడున్న వాళ్ళతో అతను.

పిల్లవాడు మెల్లమెల్లగా మామూలుస్థితికి రాసాగాడు. ''ఈ అబ్బాయి ఎవరి పిల్లవాడు?'' అని చుట్టూ ఉన్నవాళ్ళను ఉద్దేశించి అడిగాడు కపిల్.

''నా తమ్ముడుబాబూ!'' అన్నాడు అక్కడే ఉన్న ఒక పశువులుకాచే కుర్రాడు.

''నువ్వీ అబ్బాయిని బాగా చూసుకోవాలి,'' అన్నాడు కపిల్ గంభీరంగా.

డాక్టర్ వస్తూ వస్తూ ఆ పిల్లవాడి కోసం ఒక దుప్పటి, వేడి పాలు తీసుకు వచ్చాడు. ''మీ స్కౌట్లు ఇద్దరూ చాల గొప్ప పని చేశారు. ఈ అబ్బాయికి ఇంకేం ఫరవాలేదు.'' అన్నాడు.

జశ్వంత్ కపిల్ కోసం స్కౌటు శిబిరం దగ్గర కాచుకున్నాడు. ''ఇవాళ నువ్వేం చేశావ్ జశ్వంత్?'' అని అడిగాడు కపిల్.

''కుమార్, నేనూ...తప్పిపోయిన ఒక దూడకోసం వెతుకుతూ వెళ్ళాం. అది మమ్మల్ని తెగతిప్పించిందిలే!'' అన్నాడు జశ్వంత్ నవ్వుతూ.

''నేను కర్నాల్‌లో రాష్ట్రాల మధ్య జరిగే ఆటల పోటీలు ఏర్పాటు చేయబడి నప్పుడు—మా స్కౌటుపనులు వేరుగా ఉండేవి,'' అన్నాడు కపిల్ ఏదో ఆలోచిస్తూ. ''అప్పుడు మేము ముసలివాళ్ళకు రోడ్డు దాటడానికి సాయపడేవాళ్ళం. వచ్చినవాళ్ళ సరైన బస్సులు ఎక్కడానికి సహాయపడడం—గేటుదగ్గర టిక్కెట్లు తనిఖీ చేయడం—లోపలికి వచ్చిన వాళ్ళను వాళ్ళ సీట్ల దగ్గరకు తీసుకుపోవడం—ఇటువంటి పనులే చేశాము.'' అన్నాడు కపిల్

''అవును. నగరంలోని సమస్యలు, గ్రామంలోని సమస్యలు వేరువేరుగా ఉంటాయి. నాకు ఈ మనుషులంటేనే చాలా ఇష్టం వాళ్ళ ఎంత కష్టపడి జీవిస్తూ ఉన్నా, ఎప్పుడూ ఉత్సాహంగానే కనిపిస్తారు. స్నేహంగా ఉంటారు. అదుగో వాళ్ళు పాటలు పాడుకుంటున్నారు...విను.'' అన్నాడు జశ్వంత్.

ఆ మైదానానికి సమీపంలో 'పహారి' జానపద గేయం ఒకటి వినిపిస్తున్నది. ఆడవాళ్ళు అక్కడక్కడ చిన్న చిన్న మంటలు రాజేసి వంటలు చేసుకుంటున్నారు.

''నవీన్ ఇక్కడికి వచ్చివుంటే బావుండేది.'' అన్నాడు కపిల్.

''మనం అతణ్ణి, 'పశువుల కాపరి కుటీరం' క్యాంపుకు తీసుకువెళ్దాము. వచ్చే ఏడాదికి అతను స్కౌటు అవుతాడులే!'' అన్నాడు జశ్వంత్.



అప్పటికే చాలా రాత్రి అయింది.

కపిల్ చాంద్‌పూర్‌లో ఉండగా నవీన్ వారం చివర క్యాంపుకు వెళ్లడానికి కావలసిన సరంజామా అంతా సిద్ధం చేయసాగాడు.

ప్రతిరోజూ ఉదయం భోజనం చేశాక తన వీపుమీద ఒక బస్తాను ఉంచుకొని, తనకు అవసరమైన వస్తువులన్నీ తీసుకుని నడవడం అలవాటు చేసుకున్నాడు. నవీన్ సరంజామాలో ఒకసంచీ, అందులో మార్చుకోవడానికి మరోజతబట్టలు, మడిచిపెట్టడానికి వీలైన వెచ్చని తేలికైన పడక, కొద్దిగా ఆహారపదార్థాలు ఉన్నాయి. ఎవరి ఆహారం వాళ్ళే వండుకునే పద్ధతికూడా స్కౌటు పరీక్షలలో ఒకటి!

కపిల్, జశ్వంత్ టీ వేళకు తిరిగి వచ్చారు. ఆ సాయంకాలమంతా పశువుల సంతలో జరిగిన విశేషాల గురించీ, వారం ఆఖరులో తాము చేయనున్న క్యాంపు గురించీ మాట్లాడుతూ గడిపారు వాళ్ళు.





# పిక్‌నిక్

''టక్...టక్...టక్...''

ఆ రోజు శనివారం. అప్పుడే తెల్లవారుతూ ఉంది. కపిల్, నవీన్ వడ్రంగి పిట్ట చేస్తున్న చప్పుడువిని మేలుకున్నారు. లేచి క్యాంపుకు తయారుకావడం ప్రారంభించారు.

''కిందికి రండి అబ్బాయిలూ! జశ్వంత్ ఇక్కడే ఉన్నాడు,'' అన్నాడు విజయ్ బాబాయ్.

జశ్వంత్ వంటింట్లో చిన్నిఖాలూతో ఆడుకుంటున్నాడు. అతని సంచీ, పరికరాలపెట్టె చక్కగా సర్దివున్నాయి. ఒక పెద్ద నీళ్లసీసాతోపాటు జశ్వంత్ ఒక పొడవైన తాడుచుట్టను, చిన్నపిడి ఉన్న గొడ్డలినీకూడా తెచ్చుకోవడం నవీన్ గమనించాడు.

''అబ్బాయిలూ! మీరు హరికేన్ లాంతరు తీసుకువెళ్ళాలి. అందులో నూనె ఉందో లేదో చూసుకుని మరీ వెళ్లండి.'' అన్నాడు విజయ్ బాబాయ్.

తన క్యాంపు సరంజామాను వీపుమీద వేసుకుని నడవడం నేర్చుకున్నందుకు నవీన్ తనలో తాను ఎంతో సంతోషించాడు. జశ్వంత్, కపిల్‌లతోపాటు తనూ సమంగా వెళ్ళగలడన్న ధీమా ఏర్పడింది నవీన్‌లో.

''నవీన్, చితుకులువేసి నిప్పు చెయ్యడం నీకు తెలుసా?'' అని అడిగాడు జశ్వంత్.

''ఇంతకు ముందెప్పుడూ నేను చెయ్యలేదు.'' అన్నాడు నవీన్.

''అయితే ఈ రాత్రి నేను నీకు మొదటి పాఠం నేర్పిస్తాను. స్కౌటు పరీక్ష పాసుకావడానికి నువ్వు రెండు అగ్గిపుల్లలతో నిప్పు చేయడం నేర్చుకోవాలి. అయితే అందుకు మొదట మనం కట్టెలు కొట్టాలి. నేను ఈ చిన్న గొడ్డలిని తేవడం కూడా అందుకే!'' అని వివరించాడు జశ్వంత్.

''మనం నిప్పు ఆర్పడం గురించి చాలా జాగ్రత్తపడాలి. బహుశా ఎవరో అజాగ్రత్తగా విసిరిన అగ్గిపుల్ల కారణంగానో, సరిగ్గా ఆర్పని విహారయాత్ర తాలూకు నిప్పునుంచో ఆ రోజున ఆ భయంకరమైన అడవిచిచ్చు చెలరేగి వుంటుందని నా అనుమానం'' అన్నాడు కపిల్.

''అవును. మనం చాలా జాగ్రత్తగానే ఉండాలి.'' అన్నాడు నవీన్.



# 'పశువుల కాపరి కుటీరం'

సూర్యుడు మబ్బులలో దాగుడుమూతలు ఆడుకుంటున్నాడు. సాయంకాలం అవుతూ ఉండేసరికి ఆకాశం నారింజ రంగుతోను, బంగారు వన్నెతోను మెరిసిపోసాగింది.

ఆ ముగ్గురు కుర్రాళ్ళూ దట్టమైన అడవిగుండా ఎగుడు దిగుడుగా ఉన్న రాళ్ల మార్గంలో పశువుల కాపరి కుటీరం వైపు బయలుదేరారు. అదృష్టవశాత్తూ ఆబాట తక్కువదూరం కలదే కావడంతో తొందరగానే వాళ్ళు కొండశిఖరానికి చేరుకున్నారు అక్కడ విశాలమైన పీఠభూమి, అందులో ఒక వైపున కొన్నిచెట్లు—చుట్టూ అక్కడక్కడ పొదలు కనిపించడం—నవీన్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది. 'పశువుల కాపరి కుటీరం' ఆ పీఠభూమి మధ్యలో ఉంది అది దుంగలతో వేసిన ఒక గదిగల చిన్న కుటీరం. ఆ కుటీరం నేల అంతా గడ్డీ, బంకమన్నూ కలిపి అలికివుంది.

''ఇక్కడికి గొర్రెలేవో వచ్చినట్లున్నాయి. అంతా మురికిగా ఉంది.'' అన్నాడు కపిల్.

''చీపురు తయారుచేసి శుభ్రంగా ఊడ్చాలి. నేను నిప్పు చెయ్యడానికి కట్టెలు తెస్తాను. మనం త్వరపడాలి. అప్పుడే సూర్యుడు అస్తమిస్తున్నాడు,'' అన్నాడు జశ్వంత్. ఆ మాటలు అంటూనే జశ్వంత్ తాడూ, గొడ్డలీ తీసుకొని పరుగెత్తివెళ్ళాడు.

కపిల్, నవీన్ కొన్ని చిన్న చిన్న కొమ్మలను విరిచి, ఒకటిగాకట్టి చీపురులా తయారు చేశారు. దాంతో ఆ కుటీరాన్ని ఊడ్చారు. నవీన్ తమ పడకలను పరిచాడు. కపిల్ చదునుగా ఉన్న మూడు రాళ్లనుతెచ్చి, వాటిని ఒకచోట పొయ్యిలా అమర్చాడు.

జశ్వంత్ ఎండిన చితుకులు, ఒక కట్టెల మోపు ఎత్తుకుని వచ్చాడు. అతను కుటీరంముందు ఉన్న పచ్చికను కోసి—ఆ చోటును శుభ్రం చేశాడు.

''నవీన్, నేను మంటవెయ్యబోతున్నాను...వచ్చి చూడు.'' అని పిలిచాడు.

నవీన్ బయటికివచ్చి చూడసాగాడు. జశ్వంత్ మొదట ఎండు చితుకులను ఒక కుప్పగా వేశాడు. ఆ తర్వాత వాటిచుట్టూ చిన్న చిన్న కొమ్మలు సన్నగా ఉన్నవి వేసి—పైన పెద్దదుంగలతో అదంతా ఒక పాకలా అమర్చాడు.

''చితుకులు, కొమ్మలూ త్వరగా అంటుకుంటాయి. అయితే అవి తొందరగా కాలిపోతాయి. దుంగలు అంటుకోవడానికి చాలా సమయం పడుతుంది. అయినా అవి

చాలా సేపు మండుతాయి.'' అంటూ, ''మనం ఈ రాత్రికి ఏం వండుదాం?'' అన్నాడు జశ్వంత్.

''మనం తెచ్చుకొన్న గోధుమ రొట్టెలు కొన్ని మిగిలిపోయాయి. పెద్ద బంగాళా దుంపలను నిప్పులో కాల్చుకుని తిందామా? అవి బావుంటాయి.'' అన్నాడు కపిల్.

''భలే!'' అన్నాడు నవీన్—అలా అంటూనే వండడానికి ఒక కుండతెచ్చాడు. కపిల్ రాళ్ల పొయ్యికింద చిన్న గొయ్యితీసి జశ్వంత్ వేసిన మంటలోంచి కొన్ని మండుతున్న కట్టెలుతెచ్చి పొయ్యిలో ఎశాడు. నవీన్ వంట ప్రారంభించాడు.

తను వేసిన మంట చిటపడలాడుతూ ఉంటే—ఆ నిప్పుల మధ్య మూడు పెద్ద బంగాళాదుంపలు వేశాడు జశ్వంత్.

''బంగాళా దుంపలు ఎలా ఉన్నాయి? వీటి వాసన భలేగా ఉంది!'' అన్నాడు కపిల్.

ఆ ముగ్గురబ్బాయిలూ తగరం పళ్లాలు తెచ్చుకున్నారు. తృప్తిగా భోంచేశారు. బాగా వేగి, వేడిగా ఉన్న బంగాళాదుంపలు చాలా రుచిగా ఉండి—వాళ్ల కడుపులు నింపాయి. రొట్టెలు తిన్నాక, వాళ్ళు తమ తమ పళ్ళాలను బూడిదతో శుభ్రం చేసుకున్నారు.

ఆ తర్వాత జశ్వంత్ జేబులోంచి ఒక చిన్న మౌత్—ఆర్గన్ తీసి వాయించడం మొదలుపెట్టాడు. నవీన్ అతణ్ణి ఆశ్చర్యంగా చూశాడు. జశ్వంత్ ఒక చక్కని 'మహేరి' పాట వరసనూ, ఆ తర్వాత కొన్ని వినోదకరమైన స్కాటు పాటలనూ, పేరు





పొందిన సినిమా పాటలనూ వాయించాడు. తమకు పదాలు తెలిసినచోటల్లా కపిల్, నవీన్ ఆ పాటలు పాడారు.

‘‘నవీన్‌కు నిద్ర వస్తున్నట్లుంది,’’ అన్నాడు కపిల్.

‘‘మనం ఇక నిద్రపోవడం మంచిది. నేను ఈ మంటను ఆర్పేస్తాను,’’ అన్నాడు జశ్వంత్.

నవీన్ కుటీరంవైపు వెళ్ళాడు. ఆ తలుపు దగ్గర ఆగి ‘ఓ’ అని కేకపెట్టి వెనక్కుపడ్డాడు.

సన్నగా, పొడవుగా ఉన్న ఒక జంతువు అతని మీదుగాగెంతి, కపిల్‌ను ఒరుసుకుంది. అతను ''ఏమిటది చూడు'' అంటున్నంతలో అది జశ్వంత్‌ను తపీమని రాసుకుంటూ పీతభూమిలోకి పరిగెత్తి వెళ్ళిపోయింది.

''ఏమిటది?''

''చిరుత పులి.'' అని అరిచాడు నవీన్.

''గుంట నక్క.'' అన్నాడు కపిల్.

''అది పట్టె నక్క అనుకొంటాను!'' అన్నాడు జశ్వంత్. ముగ్గురూ విరగబడి నవ్వుకున్నారు. అప్పుడే అడవిలో ఒక నక్క కూసింది.

''గుడ్‌నైట్ మిత్రమా! బాగా బెదిరించావ్ మమ్మల్ని,'' అన్నాడు కపిల్

''మనం పడుకుంటూ ఉండగా—తిండిని వెతుక్కుంటూ ఆ నక్క లోపలికి వెళ్ళిందేమో.'' అన్నాడు జశ్వంత్ పడుకుంటూ. తక్కిన ఇద్దరూ అప్పటికే పడకల్లోకి చేరుకున్నారు. ''బాగా నిద్రపొండి,'' అన్నాడు జశ్వంత్. అందుకు జవాబేమీ రాలేదు. నవీన్, కపిల్ అప్పటికే నిద్రపోయారు.



# అర్ధరాత్రివేళ సాహసం

అర్ధరాత్రి ప్రాంతంలో నవీన్ ఉలిక్కిపడి లేచాడు. అతణ్ణి మేలుకొనేలా చేసిందేమిటి? కుటీరమంతా చీకటిగా ఉంది. అంతా నిశ్శబ్దంగా ఉంది. జశ్వంత్, కపిల్ ఆదమరచి నిద్రపోతున్నారు.

నవీన్ లేచాడు. ఏ చప్పుడూ వినిపించలేదు. ఎక్కడా ఏ కదలికా లేదు. "బహుశా ఏదైనా పీడకల కన్నానేమో," అనుకున్నాడు.

మళ్ళీ పడుకోబోతుండగా "ఆ...ఓ..." అన్న అరుపు కీచుగా వినిపించింది. అది మనిషి కంఠస్వరమో—జంతువు కూతో నవీన్‌కు తెలియలేదు.

"జశ్వంత్, కపిల్...లేవండి. ఎవరో పిలుస్తున్నారు." అన్నాడు నవీన్ త్వరత్వరగా.

"ఏమిటది?" అంటూ వెంటనే లేచాడు జశ్వంత్. "నవీన్, ఎందుకు చలిలో నిలబడ్డావు? స్వెట్టర్ వేసుకో," అన్నాడు.

"జశ్వంత్, విను."

"ఆ...ఓ......" ఆ శబ్దం కొంత దగ్గరగా వినిపించింది. ఆ ధ్వనిలో నిస్సహాయత, బాధా వినిపిస్తున్నాయి.

"ఉండు, దీపం వెలిగించనీ!" అంటూ జశ్వంత్ లాంతరు వెలిగించాడు.

"ఏమైంది?" అన్నాడు కపిల్ నిద్రమత్తుతో...

"ఎవరో సహాయం కోసం పిలుస్తున్నారు" అన్నాడు జశ్వంత్. "మీరు వెచ్చగా ఏదైనా తొడుక్కోండి. టార్చిలైటు, తాడు, గొడ్డలి తీసుకోవాలి." అంటూ వాటిని తీసుకున్నాడు. కపిల్ పక్కమీదనుంచి గెంతాడు. "నా దగ్గర టార్చిలైటు ఉంది. నవీన్, ప్రథమ చికిత్స పరికరాలపెట్టె నా సంచీలో ఉంది," అన్నాడు.

"ఆ...ఆ...ఓ...ఆ...ఓ.." అన్న అరుపు మళ్ళీ వినిపించింది.

కొన్ని నిమిషాలకు వాళ్ళు బయలుదేరారు. నవీన్ లాంతరు పట్టుకున్నాడు.

"ఆగండి, మనం ఎటువైపు వెళ్ళాలో ముందు తేల్చుకోవాలి," అన్నాడు జశ్వంత్.

"ఆ...ఓ..." అరుపు మళ్ళీ వినిపించింది. ఆ అరుపు పీఠభూమి అవతలి



వైపునుంచి వస్తున్నట్లు అనిపించింది. వాళ్ళు అటువైపే బయలుదేరారు. వెన్నెల బాగా కాస్తుండడంవల్ల ఆ వెలుగులో చుట్టుపక్కల దారి అంతా చక్కగా కనిపిస్తున్నది. వాళ్ళు కొండ అంచు దగ్గరికి వచ్చారు. అక్కడ నేల చదునుగా బాగా ఏటవాలుగా కిందికి వాలినట్లు ఉంది. ఆ అంచుదగ్గర కొన్నిపొదలు ఉన్నాయి. అక్కడ ఇంకేమి ఉన్నట్లు లేదు.

''హోయ్...ఎవరక్కడ? ఎక్కడున్నారు?'' అనిఅరిచాడు జశ్వంత్.

''ఆ...ఁ...ఇక్కడ...కింద ఉన్నాను,'' అన్న కేక వినిపించింది. జశ్వంత్ కడుపు నేలకు ఆనేలా పడుకొని—కొండ అంచుకు పాకాడు. టార్చి వెలిగించి కిందకు చూశాడు. కపిల్ కూడా అతని పక్కన పడుకుని టార్చిలైటు వెలిగించాడు.

''జశ్వంత్...అదుగో...ఆ బండమీద చూడు...ఒక పిల్లవాడు...'' కపిల్ చూపించాడు.

కొండ అంచునుంచి పదిహేను అడుగులకింద కొండ పక్కలనుంచి పొడుచుకు వచ్చిన ఒక బండమీదికి టార్చిలైట్ల వెలుతురు పడింది. ఆ బండమీద పశువులుకాసే కుర్రాడొకడు ఒదిగి కూర్చుని ఉన్నాడు. ఆ కుర్రాడు తన చేతులతో దేన్నో పట్టుకొని ఉన్నాడు.

''అలాగే ఉండు...భయపడకు...మేము త్వరగా నిన్ను పైకి చేరుస్తాము,'' అన్నాడు జశ్వంత్.

''నీ దగ్గర అదేమిటి?'' అని అడిగాడు కపిల్.

''ఇది గొర్రె...దయచేసి నాకు సాయం చెయ్యండి.'' ఆ కుర్రాడు ఏడుస్తూ అన్నాడు.

జశ్వంత్ తాడును విప్పాడు. ''అబ్బాయ్, ఆ బండమీద మరొకరు దిగడానికి చోటుందా?'' అని అడిగాడు.

''చాలా తక్కువ చోటుంది.'' అన్నాడా కుర్రాడు.

''జశ్వంత్, నన్నుకిందికి వెళ్ళనీ నువ్వు తాడును పట్టుకోవడం సులభ మేమో,'' అన్నాడు కపిల్.

''సరే! నేను తాడును నీనడుము చుట్టూ కడతాను. నవీన్, నువ్వు ఆ అంచుమీద లాంతరు పట్టుకో...... కపిల్, గుర్తుంచుకో. తాడును నీ రెండు చేతులతో పట్టుకో... కొండకు కాళ్ళు అనిస్తూ దిగుతున్న ప్పుడుజాగ్రత్త! నేను తాడునుమెల్లిగా దింపుతాను.'' అన్నాడు జశ్వంత్.

''బూట్లు విప్పేసి వెళితే మంచి దేమో,'' అని సలహా ఇచ్చాడు నవీన్.

# ఆపదలో రక్షణ

గాలి జోరుగా వీస్తున్నది. చందమామకు మబ్బులు అడ్డం వచ్చాయి. కపిల్ కొండ అంచులను పట్టుకొని కిందకు దిగసాగాడు. కాళ్ళు ఆన్చడానికి అక్కడ రాళ్ళూ, రప్పలూ అవీ చాలా తక్కువగానే ఉన్నాయి. తాడును గట్టిగా పట్టుకుని జశ్వంత్‌మీద పూర్తి నమ్మకంతో ''సరిగ్గానే ఉంది. నేను వెళ్ళగలను.'' అన్నాడు. జశ్వంత్ తాడును రెండు చేతులతోను పట్టుకొని మెల్లగా కిందికి జారవిడవసాగాడు.

''సరిగ్గా ఉందా కపిల్?'' అని అడిగాడు జశ్వంత్.

''మరో...మూడు అడుగుల దూరం ఉందనుకుంటాను,'' అని జవాబిచ్చాడు కపిల్. ''ఆఁ, నేను దిగాను,'' అన్నాడు మరికొన్ని క్షణాల్లో.

ఆబండమీద ఉన్న పిల్లవాడికి పదేళ్ళు ఉంటాయి. ''నువ్వు వ్యాస్‌గారింట పనిచేసే జయదేవ్ కొడుకువుకదూ,'' అని అడిగాడు కపిల్ ఆ కుర్రవాణ్ణి చూస్తూ.

''అవునండీ...నా పేరు థాను. ఈ గొర్రెపోతే మానాన్న నన్ను కొడతాడు. నేనిక్కడ ఎన్నో గంటలనుంచి పడున్నాను,'' అన్నాడు ఆ కుర్రవాడు ఏడుస్తూ.

''ఏడవకు థానూ...నీకు, నీ గొర్రెకూ ఇక ఏమీ ఫరవాలేదు.'' అన్నాడు కపిల్ ఆ అబ్బాయిని సముదాయిస్తూ. ఒక నిమిషం తర్వాత ''జశ్వంత్, నువ్వు ఈ కుర్రాణ్ణి పైకి లాగలేవు. ఈ అబ్బాయి చేతికి దెబ్బ తగిలింది.'' అన్నాడు.

''ఏమిటి ఎక్కడ దెబ్బ తగిలింది?''

''భుజం దగ్గర.''

''అయితే గాయాన్ని తాకకు. రెండు, నన్ను ఆలోచించనీ.'' అని మరికొన్ని క్షణాల తర్వాత ''కపిల్, జాగ్రత్తగా విను. గొర్రె బాగా పెద్దదా?'' అని అడిగాడు జశ్వంత్.

''కాదు...చిన్నదే...''

''నీ దగ్గర తాడు ఉందా?''

''ఉంది.''

''నీ చిన్న కత్తి.''

''ఉంది.''

''నువ్వు గొర్రెపిల్లముంకాళ్లను, వెనుకకాళ్లను విడివిడిగా కలిపికట్టగలవా? '

''ప్రయత్నిస్తాను!'' అన్నాడు కపిల్. తన చాకును తీసి కొంతతాడును కోశాడు.

తన కాళ్లను తాడుతో కట్టేస్తూ ఉండేసరికి గొర్రెపిల్ల భయపడింది. దాన్ని కట్టడానికి థాను సాయపడ్డాడు.

''కట్టేశాను!'' అని అరిచాడు కపిల్.

''ఇప్పుడు...పశువుల కాపర్లు చేసేలా—గొర్రెపిల్లను నీ భుజాలమీద వేసుకో.'' అని బిశ్వంత్ ఆజ్ఞాపించాడు.

గొర్రెపిల్ల బాగా బరువుగానే ఉంది. బండమీదనుంచి పడకుండా దాన్ని తన భుజాలమీదికి ఎత్తుకోవడం కపిల్‌కు కష్టమే అయింది.



''ఇప్పుడు జాగ్రత్తగా విను. నీ దగ్గర తాడుగానీ పెద్ద రుమాలుగానీ ఉందా? ఉంటే గొర్రెపిల్ల ముందు కాళ్ళను, వెనుక కాళ్ళనూ నీ ఛాతీ మీద చేర్చి—గట్టిగా కట్టిపెట్టు.''

''థాను దగ్గర చిన్న తలపాగా ఉంది.'' అన్నాడు కపిల్.

''ఆ అబ్బాయిని ఆ తలపాగా ఇమ్మను.'' కపిల్ థాను దగ్గరనుంచి తలపాగా తీసుకొని దాంతో మొదట గొర్రెపిల్ల వెనుక కాళ్ళచుట్టూ చుట్టి, వాటిని ముందు కాళ్ళతో కలిపి కట్టాడు. ఇప్పుడు ఆ గొర్రె పిల్ల కపిల్ మెడచుట్టూ పెద్ద రుమాలులా ఉంది.

''నేను సిద్ధం,'' అన్నాడు కపిల్.

''అయితే—తాడును పట్టుకో నేను

నిన్ను పైకి లాగుతాను...మెల్లగా పైకిరా...కిందికి చూడకు,'' అని సూచించాడు జశ్వంత్. కిందికి దింపడంకన్నా, మీదికి లాగడం కష్టంగా ఉంది. జశ్వంత్ చేతులు తాడును లాగలేక మొద్దుబారిపోయాయి.

కొండ అంచుకు దగ్గరగా కపిల్ తల కనిపించేవరకు నవీన్‌కు ఆందోళనగావుంది. కపిల్ మీదికిరాగానే నవీన్ చేయూత ఇచ్చి—పైకిలాగాడు జశ్వంత్. తనభుజాల మీదినుంచి గొర్రెపిల్లను విప్పేంతలో కపిల్ చాలా ఆయసపడిపోయాడు.

''అమ్మయ్య—మరికొన్ని నిమిషాలు గడిస్తే ఈ గొర్రెపిల్ల నాగొంతు నొక్కేసి ఉండేది.'' అంటూ తన మెడను చేతులతో రుద్దుకున్నాడు కపిల్. ''మరి...మనం థానును పైకి తీసుకురావడం ఎలా జశ్వంత్?'' అని అడిగాడు.

''ఇదిగో...ఈ తాడుకొసను—ఈ చెట్టుబోదెకు గట్టిగా కట్టాను. ముడి వదులుకాదు,'' అంటూ ''థానూ...నేను తాడును కిందికి వేస్తున్నాను. కొన నీదగ్గరకు రాగానే పట్టుకో.'' అన్నాడు జశ్వంత్.

''సరే...'' అన్నాడు థాను. జశ్వంత్ తాడును కిందకు వదిలాడు. ''నేను తాడును పట్టుకున్నాను.'' అన్నాడు థాను.

''సరే...ఇప్పుడు తాడు వదిలెయ్యి. నిన్ను పైకి తేవడానికి నేనువస్తున్నాను.'' అంటూ ''కపిల్...నాకు థాను తలపాగా ఇయ్యి.'' అన్నాడు జశ్వంత్.

జశ్వంత్ తన చెప్పులు విడిచి కొండ అంచు దగ్గరికివెళ్ళి తాడు పట్టుకొని కిందికి దిగసాగాడు—కాళ్ళను కొండరాళ్ళకు ఆనిస్తూ.

కపిల్, నవీన్ ఊపిరి బిగబట్టుకొని గొర్రెపిల్లను చేర్చిపట్టుకొని టార్చి లైట్ల వెలుగునే చూడసాగారు.

ఉన్నట్టుంచి జశ్వంత్ కాలు పట్టుతప్పింది. అతను తాడు పట్టుకొని వ్రేళ్ళాడాడు! తాడు బిగిసింది.

''గొర్రెపిల్లను పట్టుకో నవీన్!'' అన్నాడు కపిల్ కంగారుగా. రెండు చేతులతోను తాడును పట్టుకొని చెట్టుబోదె మీది పట్టును వదులుచేశాడు కపిల్. జశ్వంత్ మెల్లిగా కొండపక్కగా చేరుకుని కాళ్ళకు పట్టుచిక్కించుకున్నాడు.

ఆ తర్వాత వేగంగాదిగి బండమీద ఉన్న థానును చేరుకున్నాడు.

''నువ్వు చాలా ధైర్యశాలివి థామూ!'' అన్నాడు జశ్వంత్. ''ఇప్పుడు నువ్వు మరింత ధైర్యంగా ఉండాలి. నువ్వు నావెనుక వీపుమీద ఎక్కాలి. దెబ్బతినని నీచెయ్యిని నా నడుముచుట్టూవేసి గట్టిగా పట్టుకో. ఆ...అలా...నీ కాళ్లను నా చుట్టూవేసి బిగించినట్టు. ఆ...అలాగ...ఇప్పుడు నిన్ను నాతో కట్టేస్తాను.'' అంటూ జశ్వంత్ తలపాగాతో థామనూ—తననూ కలిపి ముడిపెట్టుకున్నాడు.

''థామూ, ఇలా వెళ్లడం బాధగానే ఉండొచ్చు. కానీ నువ్వు మాత్రం పట్టు వదలకూడదు.'' అన్నాడు జశ్వంత్

''నేను గట్టిగా పట్టుకొంటాను.'' అన్నాడు థాము దీనంగా చూస్తూ.

జశ్వంత్ మెల్లిగా ఒకొక్క అడుగు పట్టుచూసుకుని పెడుతూ పైకి ఎక్కసాగాడు. వీపుమీద ఆ కుర్రవాడి బరువుతో పైకి ఎక్కడం చాలా కష్టంగానే ఉంది. థాము తేలికగానే ఉన్నా, అతణ్ణి భరించడం మాత్రం ఆ బాలభటుడికి చాలా శ్రమే అయింది. థాము గాయంవల్ల చాలా బాధపడుతున్నా, నోరువిప్పడం లేదని జశ్వంత్ గ్రహించాడు.



మెల్లిగా జశ్వంత్ పైకి ఎక్కాడు. చిట్టచివరకు కొండ అంచుదగ్గరికి చేరుకోగానే..."కుర్రాళ్ళా రండి...పైకి లాగండి!" అని అరిచాడు. అందరూ తీవ్రంగా శ్రమించారు. జశ్వంత్ మెల్లగా కడుపుమీద పాకుతూ వచ్చాడు. కపిల్, నవీన్ వెనక్కి కుప్పగా కూలారు. గొర్రెపిల్ల అరవసాగింది.

అందరూ మెల్లగా పశువుల కాపరి కుటీరం వైపుకు దారితీశారు. పక్షులు కిలకిలారవాలు అక్కడక్కడా వినిపించసాగాయి. అప్పుడే తెల్లవారుతూ వుంది. జశ్వంత్ థానూను కుటీరంలోకి తీసుకువెళ్లి కిందికి దించాడు. "ఈ అబ్బాయి ఆకలితో అల్లాడుతున్నాడేమో!" అని నవీన్‌తో అన్నాడు.

నవీన్ ఒక మగ్గునిండా వేడిపాలునింపి, అలసి సొలసి ఆకలితో ఉన్న ఆ కుర్రవాడికి అందించాడు.

జశ్వంత్ తన సంచీనుంచి ఒక స్వెట్టర్ తీశాడు. థాను ఒంటిమీద నూలు చొక్కా మాత్రమే ఉంది. ఆ కుర్రవాడి పైజామా చిరిగిపోయి ఉంది. జశ్వంత్, థాను భుజాన్ని వదులుగా ఒడిసెలాకట్టి—ఆ తర్వాత ఆ అబ్బాయికి స్వెట్టరు తొడిగాడు. అది థాను మోకాళ్ళ కిందికి వచ్చింది. గొర్రెపిల్ల మళ్లీ అరవసాగింది. కపిల్ దాని కాళ్ళ కట్లు విప్పాడు. నవీన్ దానికి మిగిలిన పాలు ఇచ్చాడు.

థాను పాలు తాగి—ఆ ముగ్గుర్నీచూసి—చిరునవ్వు నవ్వాడు. ఆ తర్వాత్ల కపిల్ వరుపులో పడుకుని ఆదమరచి నిద్రపోయాడు.

పక్షులన్నీ లేచాయి. అంతటా కలకలమంటూ గోలచేయసాగాయి. ఓ అందమైన రోజు ప్రారంభమైంది!

# ఇంటికి ప్రయాణం

ఓ రెండు గంటల తర్వాత థానూను నిద్రలేపి—వాళ్ళు బయలుదేరారు. దారిలో థాను వాళ్లకు తన కథ చెప్పాడు.

''నేను—పశువుల కాపరి నాథూరామ్ కలిసి—గొర్రెలను మేపడానికి బయలుదేరి వచ్చాము. మేము కమతానికి తిరిగి వెళ్లిచూస్తే—ఈ గొర్రెపిల్ల కనిపించలేదు. అంతకు ముందు ఇలాగే ఒక గొర్రె తప్పిపోతే వ్యాస్‌బాబుగారికి చాలా కోపం వచ్చింది. అంచేత ఈసారి నేను నాథూరామ్‌కు చెప్పకుండానే ఈ గొర్రెపిల్ల కోసం పరుగెత్తి వచ్చాను. దాని అరుపు విన్నాను. అది బండమీదికి దిగిందే కాని పైకి రాలేక పోయింది.''

''మరి నువ్వు అంత కిందకి ఎలా దిగావు?'' అని అడిగాడు కపిల్.

''నాకే తెలియదు. మా నాన్న కొడతాడనే భయంతో నేను గొర్రెపిల్లను వదిలిపెట్టలేక పోయాను. చీకటి పడటంతో నాకు పెద్ద భయం వేసింది.''

దూరాన జయదేవ్, నాథు చేతుల్లో దుడ్డు కర్రలు పట్టుకొని కొండమీదికి రావడాన్ని వాళ్ళు గమనించారు. వాళ్లిద్దరూ ఈ బృందాన్ని చూడగానే ''హమ్మయ్య, మీరు పిల్లవాణ్ణి కనిపెట్టారు. వీడు కనపడక మేము ఎంత కంగారుపడ్డామో!''

''వీళ్ళు నా ప్రాణాలు కాపాడారు నాన్నా!'' గొర్రెపిల్లను కూడ కాపాడారు,'' అన్నాడు థాను.



"ఓరి తుంటరి వెధవా!" ఆని ఏదో అనబోయాడు జయదేవ్. అంతలోనే జశ్వంత్ అడ్డు తగిలి "మీరు ఆ అబ్బాయిని తిట్టకూడదు.. మీవాడు మంచి ధైర్యశాలి. అతనిభుజానికి దెబ్బతగిలింది. అంచేత ముందు డాక్టరుదగ్గరికి తీసుకువెళ్ళాలి," అన్నాడు.



కమతంలో వ్యాస్‌గారు కబురుకోసం ఆందోళనగా ఎదురు చూశారు. అసలు సంగతి తెలియగానే ఆయన థానును సిమ్లాలోని ఆసుపత్రికి పంపే ఏర్పాటు చేశారు.

"మీరు స్కౌట్లు కావడం ఎంత మంచిదయింది. మీ స్కౌటు శిక్షణ ఒక

పిల్లవాడి ప్రాణాలు కాపాడింది. మీ బాబాయి మిమ్మల్నిచూపి గర్విస్తాడు కపిల్!''
అన్నారు వ్యాస్‌గారు.

కాసేపటికి వాళ్ళందరూ 'తారా' కమతానికి బయలుదేరారు.



# ఒక అభివందనం

ఆ సాయంకాలం కుటుంబమంతా వచ్చిక బయలులో సమావేశమయ్యారు. కవల పిల్లలు రాము, రాణి నవీన్‌కు దర్భముడికీ మామూలు ముడికీ మధ్య తేడా ఏమిటో చెబుతున్నారు. జస్వంత్, కపిల్ ఇద్దరూ రేఖ అడిగే ప్రశ్నలకు సమాధానాలు చెబుతూ—థాను రక్షణ గురించీ, క్యాంపు గురించీ చెప్పసాగారు.

"నవీన్ మీదనుంచి నక్క గెంతిందన్నారే అది నాకు భలే తమాషాగా ఉంది." అంది రేఖ నవ్వుతూ.

"నువ్వు అప్పుడు చూసివుండాలి నవీన్ ముఖం," అన్నాడు కపిల్.

"నవీన్, ఇలాచూడు. ఈ సెలవులు నీకు స్కౌటింగ్ గురించి చక్కగా పరిచయం చేశాయి. స్కౌటింగ్‌వల్ల నిత్యజీవితంలో ఎన్ని ఉపయోగాలున్నాయో నీయంతట నువ్వే గ్రహించావు." అన్నాడు విజయ్ బాబాయ్.

నవీన్ జవాబు చెప్పసాగాడు, "నాకు బాగా తెలిసిందండీ. పక్షుల గురించీ, చెట్లగురించీ కూడా తెలిసింది."

"అలాగే జంతువుల గురించీ, అడవి పువ్వుల గురించీ కూడ తెలిసింది." అని గొంతు కలిపింది రాణి.

"అవును రాణీ! వీటానికి నాచుట్టూ ఉన్న ప్రపంచాన్ని కొత్త దృష్టితో చూడడం నేర్చుకున్నాను," అన్నాడు నవీన్.

"నీపైనున్న ఆకాశాన్ని గురించి కూడ నేర్చుకున్నావు." అన్నాడు కపిల్.

"చెట్టుచుట్టూ ఎలాంటి ముడివేస్తే ఆగుతుందో జశ్వంత్‌కు తెలిసి ఉండడాన్ని గమనించాను. అలాగే కపిల్ తన నడుముచుట్టూ మరొక విధమైన ముడివేసుకోవడం గమనించాను. వ్రడంగం తెలిసి ఉండడం, కట్టెలు కొట్టడం, మంట వెయ్యడం—వంటివి నేర్చుకోవడంవల్ల ఎన్ని ఉపయోగాలున్నాయో తెలుసుకున్నాను."

"పళ్లాలుకడగడంవల్ల ఎంత ఉపయోగముందో తెలుసుకున్నావు." అంది రేఖ.

"మరి వంటచెయ్యడం, నిప్పు ఆర్పడం, పశువులకాపర్ల పిల్లలను రక్షించడం ఇలా ఎన్నెన్నో చెయ్యడం గురించి?"

"ఆ...ఈమాటంటే జ్ఞాపకం వచ్చింది...థాను ఇప్పుడు కోలుకున్నాడు. ఆ అబ్బాయి భుజానికి ప్లాస్టర్ వేశారు. ఆ ఎముక విరుగుడు అంత ప్రమాదకరమైనది

కాదుట. అంచేత త్వరలోనే నయమవుతుంది. అక్కురాడు మీకుకృతజ్ఞతలు చెప్పమన్నాడు." అన్నాడు విజయ్ బాబాయ్.

"నవీన్...ఈసారి నువ్వు మా స్కౌటు బృందంలో చేరుతావనుకుంటాను..." అన్నాడు కపిల్.

"నన్ను చేర్చుకుంటారంటావా?" అని అడిగాడు నవీన్.

"నువ్వు ఇప్పటికే ఎంతో నేర్చుకున్నావు. నీలాంటివాళ్ళే మంచి స్కౌట్లు అవుతారు." అన్నాడు విజయ్ బాబాయ్.

"వచ్చే ఏడాది నాకు పదిహేడేళ్ళు రాగానే—నేను 'స్కౌటింగ్'లో 'రోవర్' అర్హత పొందుతాననుకుంటాను." అన్నాడు జశ్వంత్.

ఇంతలో రేఖ ఇంట్లోకి పరుగెత్తివెళ్ళి ఒక పెద్ద పళ్ళెం మోసుకువచ్చింది. "నేను నా 'గైడ్ వంట బాడ్జి' తెచ్చుకోగలననుకుంటాను. ఇలా చూడండి, మీకో తమాషా!" అని పళ్ళెంమీది మూత తీసింది రేఖ. వేడివేడి హల్వా ఉంది. ఆ హల్వా మీద వేరుసెనగకాయలతో ఈ అక్షరాలు కనిపించాయి:

మన స్కౌట్లు జశ్వంత్, కపిల్, నవీన్‌లకు ఒక అభివందనం.



